# స్టేట్ బ్యాంక్ చూపించే దారి....

# మీ ఆయన కన్న కలలు నిజమయ్యే మార్గం.

మీరు యవ్వనంలో ఉన్న రోజుల్లో మీరూ, మీ ఆయన కలసి భవిష్యత్తుకోసం ఎలాంటి పథకాలు వేసుకున్నారో గుర్తుకు తెచ్చుకోండి. అమ్మాయి పెళ్ళి వైభవంగా చేయాలి. అబ్బాయిని పై చదువులు చదివించాలి...

జీవితం పూలబాటలా కన్పించిన రోజులు. మీ వారికి నిలకడైన సంపాదన. ఖర్చులు తక్కువ. కలలుకనే అవకాశమున్న కమ్మటి రోజులు. మీ వారికి జీవిత బీమా ఉంది, ప్రావిడెంట్ ఫండ్ ఉంది ఇంకా పొదుపు చేసిన ఇతర డబ్బూ ఉంది. ఇక లోటేముంది. అనిపించిన రోజులవి.

అయితే అనుకున్నట్లు సాగిపోయేదికాదుగా జీవితం అన్నది. ఇవాళ పూర్వంలా హాయిగా గడవడంలేదు. అలాంటప్పుడు, ముందు ముందు మీ ఆయన కుటుంబానికి కావలిసినంత సంపాదించ లేనప్పటి మాటేమిటి? ఇన్నాళ్ళుగా జాగ్రత్తగా వెనకేసుకున్న సొమ్ము ఇంకెన్నాళ్ళు వస్తుంది. మీ ఆయన కన్న కలల్లో ఎన్ని ఫలిస్తాయి?

ఆ మీ ఆలోచనలన్నీ కట్టిపెట్టి స్టేట్ బ్యాంక్‌కి రండి. ఇప్పుడు మీకున్న నెలవారీ ఖర్చులకోసమే గాక మీకున్న ఖర్చులకోసం కూడా తోడ్పడేందుకు మీ డబ్బును తెలివిగా ఎలా మదుపు పెట్టాలో మేం వివరిస్తాం. మీరు జీవిత కాలమంతా కూడబెట్టిన సొమ్ము ఎల్లకాలం మీకు తోడ్పడే మార్గం చూపిస్తాం.

ఉదాహరణకి, మీరు మావద్ద రూ. 20,000 5 ఏళ్ళకు గానీ అంతకన్న ఎక్కువ కాలపరిమితికి గాని డిపాజిట్ చేస్తే, మేం మీకు, నిర్దేశింపబడిన కాలానికి ప్రతి సంవత్సరం రూ. 1800 చొప్పున తిరిగి ఇస్తాం. డిపాజిట్ కాలపరిమితి తీరిన తర్వాత మీ రూ. 20,000 పూర్తిగా తిరిగి అందుకోవచ్చు.

స్టేట్ బ్యాంక్‌లో మేము దీన్ని మా ఫిక్సెడ్ డిపాజిట్ ప్రణాళిక అంటాం. దీన్నే మీరు 'భవిష్యత్తును నిర్భయంగా ఎదుర్కొనేందుకు' ఒక పథకం అని పిలుచుకోవచ్చు.

భారతదేశంలోకెల్ల పెద్దదైన బ్యాంక్ గనక, మీకు ఇంకా ఎన్నో విధాలైన సేవలు, సౌకర్యాలు అందుబాటువుతాయి. దేశమందంతటా 5,000 కన్న ఎక్కువ ఆఫీసులతో విస్తరించిన బ్యాంక్ కాబట్టి, మీకు దగ్గరలో మా బ్రాంచ్ ఒకటి ఉండి తీరుతుంది.

ఈ బ్యాంక్‌కిగల మూలధనం, నిల్వలు సుమారుగా రూ. 155 కోట్లు గనక, మీరు మదుపు పెట్టిన సొమ్ము పోతుందేమోనన్న బెంగలేదు. పైగా ఎంతో సురక్షితంగా ఉంటుంది కూడా.



## స్టేట్ బ్యాంక్

**మీ డబ్బును మరింత చేసుకునేందుకు మేమిచ్చే ఉచిత సలహాకొరకు మావద్దకు విచ్చేయండి.**

CHAITRA-SBI-410 TEL-Rev




బాధ పెట్టే డొల్ల అయిన పన్ను పాడైపోయిన పన్ను. వీటి నుంచి తప్పించుకోవాలంటే, పిప్పి పళ్ళు కాకుండా చూసుకోవాలి. దాని కోసం, మీ పళ్ళకు బినాకా ఫ్లోరైడ్* రక్షణ యివ్వండి.

ప్రపంచమంతా చేసిన పరీక్షల వల్ల రుజువైంది—పిప్పి పళ్ళు రాకుండా నిరోధించే విధంగా పళ్ళను గట్టి పరచేది, టూత్‌పేస్ట్‌లో గల ఫ్లోరైడ్ అనే పదార్థం మాత్రమే—పంటి ఎనామెల్‌తో యదార్థంగా కలిసి పనిచేసే పదార్థం యిదే అని. బినాకా ఫ్లోరైడ్‌లోని 'ఎక్కువ కాలం నిలిచే' ఫలితం, పిప్పి పళ్ళ ప్రభావాన్ని పెరగకుండా చేసే క్రిములను అరికట్టి బాధ కలిగించే పంటి డొల్లల్ని నిరోధిస్తుంది.

*అన్నిటికన్న అధిక ఫలితాన్నిచ్చే ఫ్లోరైడ్ కాంపౌండ్, మోనోఫ్లోరోఫాస్ఫేట్ దీనిలో వుంది.



సిబా-గాయగీ

గట్టి పళ్ళ కోసం, పిప్పి పళ్ళు రాకుండా నిరోధించటం కోసం—

# బినాకా ఫ్లోరైడ్

అగ్రశ్రేణికి చెందిన భారతదేశపు, ప్రభావంగల మొట్టమొదటి ఫ్లోరైడ్ టూత్‌పేస్ట్

UmBF 8/7 181

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 1972]

శుక్రవారం 24 8 '79
సిద్ధార్థినామ సం. భాద్రపద శు. విదియ
సంపుటము 72 : సంచిక 50

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
రేవతి పౌరులు
(ఫోటో : శంకరశాస్త్రి)

**కథలు :**

యవ్వన ... 6
దిగువ దిగువ ... 32

**సీరియల్ కథలు :**

వశిని ... 16
రాగరేఖలు ... 40

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు, లోకంపోకడ - 5, సామెతల కథలు - 8, వారఫలం - 12, పాలాక్షుని డైరీ - 14, సినిమా - 20, గిరీష్ కర్నాడ్ ఇంటర్వ్యూ - 25, రష్యాలో పిల్లలకి ప్రత్యేక సదుపాయాలు - 30, సూర్య భగవానుడి సంచి శక్తి - 36, బొమ్మల మహా భారతం - 38, ధర్మపథం - 39 హైద్రాబాద్ నోట్‌బుక్ - 48, అవీ-ఇవీ-అన్నీ-50.

# ఉత్తరాలు

## ముఖచిత్రం

3–8–79వ తేది ఆంధ్రపత్రిక వారపత్రిక ముఖచిత్రం హాలం మమ్మల్ని ఆకర్షించింది. ఈవారం కథలలో జాలిఖరీదు, భమరవంచకం కథలు బాగున్నాయి. రాగరేఖలు చదువుతూ ఉన్నంతసేపూ నాకెంత ఉత్సాహంగా ఉన్నది. ప్రపంచమునే కలవరపెట్టిన స్కైలాబ్ గురించి మాకు తెలియని విషయాలు, చాలా తెలియజేశారు. ఈ వారం కార్టూన్లు కాడ కడుపుబ్బ నవ్వించేయి.

వేమాని వేంకటేశ్వరశర్మ (సింధియా)

## కథలు

ఈవారం (3–8–79) నాటి కథలలో ల్యాండ్ లార్డ్స్, జాలిఖరీదు చాల బాగుగా వున్నాయి. వాస్తవానికి చాల దగ్గరగా వున్నాయి. అద్దెయిళ్ళలో గల ఇబ్బందులు, తక్కువ జీతగాళ్ళ సమస్యలు చాల చక్కగా వివరించారు. కొత్తకొత్త రచయితలను కూడ ప్రోత్సహిస్తున్నందుకు మీకు మా ధన్యవాదాలు.

వి. పాండుబాబా (ఉప్పులూరు)

*　*　*

27–7–79 సంచికలో ప్రచురించిన ఆవ కామందోజు రాచ్చాయ్ అవినీతి! కథ చాలా తమాషాగా ఉంది. రాగరేఖలు సీరియల్ ఆసక్తిదాయకంగా ముందుకు నడుస్తుంది.

జి. విజయలక్ష్మి, జి. ఇందిర (కావలి)

## సీరియల్

పటి మాధవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర పత్రిక మమ్మల్ని ఎంతో ఆకర్షించింది. కళిని సీరియల్ ఆరంభంలోనే మమ్మల్ని ఆకర్షించి ఈ వారం మరీ మరీ చదివేలా చేస్తుంది. రచయిత్రి గారు ఎంతో హాస్యాన్ని అందిస్తూ, ఎన్నో విషయాలను తెలియజేస్తూ సరదాగా కథ నడుపుతున్నారు. ఇంత మంచి సీరియల్ అందించిన మీకు మా ధన్యవాదాలు. చిత్ర వార్తలు పత్రికలో ఉన్నంత వివరంగా మరే పత్రికలలోను కన్పించవు అంటే అతిశయోక్తి కాదు.

పి. రామకృష్ణ, భాస్కర్, భాష, (వెంకటగిరి.)

మా పాఠకులకు రచయితలకు
ప్రకటన కర్తలకు ఏజెంట్ లకు,
అందరికి స్వాతంత్ర్యదినోత్సవ

శుభాకాంక్షలు ! సం.

## జరిగిన చరిత్ర

అహా! చూడు ప్రమాదం
ఆర్.ఎస్.ఎస్. జనసంఘం మతవాదం
అమృత్ రాజ్ నారాయణ్ మన మిత్రుడే
చౌదరిగారూ! ఇందిరాగాంధీ మనపక్షం వస్తుంది మనం మొరార్జీని పడేద్దాం!
పోతున్నారా? పీడ విరగడ అయ్యింది - పోండి!
లోకంపోకడ ఉమెన్
రాష్ట్రపతి నిజం కనుక్కొన్నారు
అయ్యో! నాశత్రువులు చాలామంచి చరణ్ మంత్రులైనారే?
చిహోరు ప్రభుత్వాన్ని కాపాడారు థాంక్స్!
ఇందిరాగాంధీ జగజ్జీవన రాం లు కలియదు - ఇక వెంకట వంజుసుల నాయుడు కర్తవ్యం కావాలి - భయపడకండి
ఆహా! నాకు నేనే సాటి! నేను జనతాని ముక్కలు చేసాను ఇరుపక్షాలు యింకా నా మీద ఆధార పడాలింది!
OOMMEN

# యవ్వన

పాలపర్తి
శ్యామలానందప్రసాద్




ఝుమ్మంటూ తుమ్మెదలు తిరుగుతున్నాయి. రేపటి పూలన్నీ వింతగా చూస్తున్నాయి.

ఆ రెక్కల చప్పుడు గుండెలో చక్కిలిగిలి పెడుతోంది ఎప్పుడు తెల్లవారుతుందో. కాలం గిరున తిరిగిపోతే బాగుండు వింత ఆనందం తెలిస్తే ఆ పూలన్నీ నవ్వుతూ తుమ్మెదల కోసం ఎదురుచూస్తాయి! 'తుమ్మెద! అబ్బ! దేవుడు భలే మంచివాడు. అవునూ! తుమ్మెదలు మొగ్గల దగ్గరకు ఎందుకు రావు? వస్తేగా అడిగేందుకు? పూలల్లో తేనె తాగేస్తుందిట. మరి అవెందుకు ఊరుకుంటున్నాయి? మా దగ్గరకు రావద్దని చెప్పక ఎదురు చూస్తూ ఉంటాయెందుకో? తొందరెందుకు. రేపు తన దగ్గరకు తుమ్మెదొచ్చినపుడు మెల్లగా సంగతులు కనుక్కోవాలి.'

"యవ్వనా! నీకు ఆ నవల ఎందుకే కాను పుస్తకాలు చదువుకోరాదూ. మహారాణిలాగా సాయంకాలమైతే ఆమేడమీద కూచోటంతప్ప ఇవతల చెంబుతీసి అవతల పెట్టే ఆశలేదు."

"అబ్బ నన్ను డిస్టర్బు చేయకు. మహా ఏం పనుంది అక్కా. ఈ నవల పూర్తి అయితేనే కాని నేనురాను"

"మీ నాన్నతో చెబుతానుండు."

"చెప్పుకో! నాన్నేగా ఇది తెచ్చింది. అయినా నవలలు చదివితే ఏం."

"ఇట్లాగే ఎదురు మాట్లాడటం నాటి మహత్యమే. చదవండి తల్లీ చదవండి. ఇంటిల్లిపాదీ నవల్లు చదవండి సినిమాలు చూడండి నాదేంపోయింది."

"పో! నువ్వెప్పుడూ అంతే పాతచింతకాయపచ్చడి" అనేసి యవ్వన మళ్ళీ నవలలో మునిగిపోయింది. అందులో వర్ణించిన హీరో యవ్వన ఊహాలోకంలో ఎంతో గొప్పగా, అందంగా లోకాతీతుడుగా మెరిసిపోతున్నాడు. నాయిక నాయకుడి రొమ్ముమీద పరిగెత్తుకుంటూవచ్చివాలిపోయేసందర్భంలో యవ్వన మనసే ముందు పరుగు పెట్టింది. 'ఆ చక్రాల్లాంటి కళ్ళూ, గాలికెగిరే పైటా, అలా ఉండాలి అమ్మాయిలంటే' అనుకుంది.

నవల పూర్తి అయింది. దాన్ని ప్రక్కన పెట్టి లేచి నుంచుని ఓ సారి మేడమీద నుంచి వీధిలోకి చూసింది. అతనొస్తున్నాడు అనుకొంది. రోజూ అదే సమయానికి ఇట్నుంచి వెళుతున్నాడు. ఎంత బావున్నాడో! ఆరు అడుగుల పొడవు, అందమైన చూపులు, ఖరీదైన వేషం, అచ్చం నవల్లోంచి పారిపోయి వచ్చినట్లున్నాడు. ఇతనెక్కడో? ఏం చేస్తుంటాడో? ఇతన్ని ప్రేమిస్తే? అవునొకసారి ప్రేమించి చూడాలి. వెంటనే అతనికో ప్రేమలేఖ రాయాలి అనుకుంది.

ఆవాళ రాత్రి పుస్తకాల మధ్యన పెట్టిన నవలలన్నీ వెతికి ఓ ఉత్తరం తయారు చేసింది. దాన్ని జాగ్రత్తగా పుస్తకాల మధ్య దాచి పెట్టింది.

మర్నాడు సాయంకాలం మేడమీద నుంచుని అతను ఎప్పుడొస్తాడా అని ఎదురు

చూస్తోంది యవ్వన. ఎంతసేపటికీ రావడం లేదు 'మగాళ్ళెప్పుడూ ఇంతే' అని ఏదో సినిమాలో డైలాగు గుర్తొచ్చింది. వీధివంకే రెప్పలార్పకుండా చూడ సాగింది.

అతనొస్తున్నాడు. యవ్వన ఆనందానికి అంతులేదు. అతన్ని ఓ సారి ఆపాదమస్తకం చూసుకుంది. గుండెల్లో భయం. అతను వాళ్ళింట ముందు కొచ్చేసరికి ఉత్తరంలో ఓ చిన్న రాయి పెట్టి అతనికి తగిలేటట్టు విసిరి కనపడకుండా తప్పుకుంది.

పరధ్యానంగా నడుస్తున్న అతను పైనుంచి ఏదో పడేసరికి ఉలికిపడి దాని వంక చూచాడు. ఏదో ఉత్తరంలా ఉంది. అతనికి అర్థంకాలేదు. తలపైకెత్తి చూశాడు. ఎవరూ కనిపించలేదు. దాన్నందుకుని ముందుకు నడిచాడు. కాస్త దూరం వెళ్ళాక విప్పిచూశాడు. 'ప్రియమైన... ఎవరో అనుకుంటున్నారా ? నేనే యవ్వనను... ?' అంతే ఆరెండు వాక్యాలు చదివి అతను ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకొని పరుగు లాంటి నడకతో తనగదికి చేరుకున్నాడు. తలుపు మూసి ఉత్తరం విప్పాడు.

'ప్రియమైన ... ...

ఎవరో అనుకుంటున్నారా ? నేనే యవ్వనను, అంటే మీమీద ఈ ఉత్తరం పడిన ఇంట్లో అమ్మాయిని. మీ పేరు నాకు తెలియకపోయినా అదికూడా చాలా అందంగా విజయ్, అర్జున్, శతృఘ్న, ఇలాంటి వాటిల్లో ఒకటై ఉంటుందనుకుంటాను. మీ అందం నన్ను పిచ్చిదాన్ని చేసింది. తొలి చూపులో మీరు నామనసు దోచుకున్నారు. మీ నుంచి నన్ను ఆదేవుడు కూడా విడతీయలేడు. రేపుసాయంత్రం పార్కులో మూల బెంచీమీద కూర్చుంటాను. నా ప్రేమను అంగీకరిస్తూ మీతొలి ప్రేమ లేఖతో అక్కడకు తప్పక వస్తారని ఆశిస్తున్నాను. రేపటి కోసం వేయి కళ్ళతో ఎదురు చూసే

మీ

యవ్వన'

అతను ఆశ్చర్య పోయాడు. 'ఎవరీమె ? నన్ను ప్రేమించిందా? నేనెప్పుడూ చూడ లేదే. అందంగానే ఉండి ఉంటుంది. ఎంత అందమైన పేరు ? పదహారేళ్ళ పైన ఉండొచ్చు. బాగ ఉన్నవాళ్ళేమో.' అతను ఒకసారికి పదిసార్లు అద్దంలో తనను చూసుకుంటూ ఉత్తరం చదువుకున్నాడు. రాత్రంతా కష్టపడి, రాస్తూ, కొట్టేస్తూ, ఓ ప్రేమ లేఖ తయారు చేశాడు. ఆమె ఎలా ఉంటుందో అనేక రకాలుగా ఊహించుకున్నాడు. తెల్లారింది.

సాయంత్రం నీట్ గా డ్రస్ చేసికొని పార్కుకు బయలదేరాడు. 'ఈ పాటికి వచ్చి ఉంటుందా ? తనెలా గుర్తుపట్టాలి? తనను చూచి చిరునవ్వు నవ్వుతుందిగా అదే గుర్తు. ఏ చీర కట్టుకొచ్చిందో ? వోణీలు వేస్తుందేమో ? వెనక నుంచి వెళ్ళి కళ్ళుమూస్తే...' అతని ఆలోచనలు తెగే లోపల మూల బెంచీ రానే వచ్చింది.

ఉలిక్కిపడ్డాడతను. ఓ పదకొండు, పన్నెండేళ్ళ పిల్ల ఆ బెంచీ చివరగా కూచోనుంది. ఇతన్ని చూచి సన్నగా నవ్వింది.

"ఎవరు నువ్వు?" అడిగాడతను.

"యవ్వన మా అక్కయ్య" అన్నది ఆ పిల్ల.

---

**పై వారమే!**

## ప్రేమ పాశం

**కొత్త సీరియల్**

---

'ఓహో ! రావడానికి వీలుపడక చెల్లెల్ని పంపిందన్నమాట. పాపం ! ఇంటి దగ్గర వాళ్ళెవరైనా కనిపెట్టారేమో ! అయినా తనుండగా భయమెందుకు ?' అనుకున్నాడతను.

"నీ పేరేంటమ్మా !"

"విమల"

"మీ అక్కయ్యేం చెప్పింది ?"

"మీరేదో ఉత్తరం ఇస్తారు. దాన్ని జాగ్రత్తగా తెచ్చి తన కిమ్మని చెప్పింది."

"మీ అక్కయ్య ఏం చదువుతోంది ?"

"అదేంటి మీరు తన ఫ్రెండని చెప్పిందే. మీకు తెలీదా ! బియ్యే చదువుతోంది."

అతని కళ్ళు మెరిశాయి.

"మీ నాన్నగారు ఏంచేస్తుంటారు ?"

"పెద్ద ఆఫీసరు."

"సరేకానీ, మీఅక్కయ్య బాగుంటుందా?"

"మా అక్కయ్యను మీరెప్పుడూ చూళ్ళేదా ? అబ్బ! నాకే ముద్దొస్తుంది. సినిమా యాక్టర్లు కూడా పనికి రారు తెలుసా ?"

అతని ఆనందానికి అంతులేదు.

"మీరేం చేస్తుంటారు ?" ఆ పిల్ల అడిగింది.

"ఎల్. డి. సి."

"ఏం చదివారు ?"

"ఎస్. ఎస్. ఎల్. సి"

కొంచెం సిగ్గు సిగ్గుగా సమాధానం చెప్పాడతను, తప్పించుకోవడానికి వీలులేక.

"ఊఁ ఉత్తరం ఇవ్వండి నేను తొందరగా వెళ్ళాలి. మా అమ్మ కేకలేస్తుంది." అతను జేబులోంచి తీసి ఆపిల్లకిచ్చాడు ఉత్తరం.

"రేపు మీ అక్కయ్యను ఇక్కడికి రమ్మని చెప్పు? ఇంద చాకెట్లు కొనుక్కో." అని ఓ రూపాయి విమల చేతిలో పెట్టాడతను.

విమల కాస్త దూరం వెళ్ళి ఉత్తరం విప్పింది.

'నామనసు దోచుకున్న యవ్వనకు సుబ్బారావు వ్రాయునది. నీ పేరుని చూచి నీవెంతో అందంగా ఉంటావని పిస్తోంది. నీ అందమైన అక్షరాలతోనే నా మనసు కొనేశావు. ఇకనేను ఎప్పటికీ నీవాడినే. మన ప్రేమలత రోజు రోజుకు అల్లుకు పోతుంది. నీకోసం ఏమైనా చేస్తాను. ఈ లోకమంతా మన ప్రేమతో నిండి పోవాలి. నీ మలి వెచ్చని కౌగిలి కోసం ఎదురు చూసే—

నీ దాసుడు

సుబ్బారావు.'

విమల ఆ ఉత్తరం చదివి నవ్వుకుంది.

మర్నాడు సాయంత్రం యథాప్రకారం సుబ్బారావు నవమన్మధుడిలా పార్కుకి చేరుకున్నాడు. ఇంకా యవ్వన రాలేదు. కోపం నటించాలి అనుకున్నాడు. కొద్దిసేపటికి విమల వచ్చింది. ఆవెనుక యవ్వన వస్తోందేమోనని చూచాడు. రావడం లేదు.

"మీ అక్కయ్యేది ?"

విమల మాట్లాడ లేదు.

"మీ నాన్నగారు కానీ, అమ్మగారు కానీ మీ అక్కయ్యను కేకలేశారా ?"

ఉన్నట్టుండి ఆపిల "నేనే యవ్వనను." అంటూ మెరుపులా పరుగెత్తి మాయమయింది.

# సామెతలు కథలు

## "హా లక్ష్మణా"

కష్టాన్నీ, బాధనూ, వ్యక్తపర్చటానికి యీ పలుకుబడిని ప్రయోగిస్తుంటారు ఊత పదంగా కూడా వాడుతూంటారు.

లక్ష్మణుడు, ముక్కూ చెవులూ కోసి, శూర్పణఖను అవమానపర్చాడు. ఆ అవమానాన్ని భరించలేక, ప్రతీకారం చేయాలనుకుంటుంది. తన అన్న అయిన రావణాసురుని వద్దకు వెళ్ళి తనను నరులు అవమానించారని చెప్పి భోరున ఏడ్చింది చెల్లెలను అవమానించినా, అన్నను అవమానించి వచ్చేవనీ, ఆ నరులను వదలకూడదనీ చెప్పింది. ఆ నరులతో, ఒక సుందరాంగి ఉన్నాదనీ, ఆమెను అనుభవించని మగజన్మ, జన్మగాదనీ, ఆమెకు అన్ని విధాల సరైన మగాడు, రావణాసురుడేననీ, ఆమె అలాంటి అపురూప సౌందర్యవతి అనీ, అలా, అలా, ఎన్నోచెప్పి రావణుని రెచ్చగొట్టింది.

రావణునికి సీతపై మనస్సు పడింది. సీతను ఎత్తుకుపోవటానికి వచ్చిన పన్నాగంలో, మారీచుని సహాయం కోరాడు రావణుడు. మారీచుడు శాపంవల్ల రాక్షసుడై పుట్టాడు. రావణాసురుని బంటుగా ఉంటున్నాడు. రావణుడు అతని సహాయాన్ని కోరినప్పుడు, మారీచుడు రావణుని ప్రయత్నాన్ని ఆపు చేయాలని ఎన్నో రకాలుగా చెప్పాడు. లాభం లేకపోయింది. గత్యంతరం లేక మారీచుడు, రావణుని చేతిలోగాక, రాముడి చేతిలో చావటం పుణ్యమనుకుని, రావణకార్యానికి ఒప్పుకున్నాడు.

రాక్షస మాయవల్ల అపురూపమైన బంగారు లేడి రూపం ధరించి, సీతారాముల పర్ణశాల వద్దకు వెళ్ళాడు. ఆ అందమైన లేడిని చూచి మోజుపడి సీతాదేవి, రాముణ్ణి ఆ లేడి కావాలని కోరింది. సీతాదేవి కోరికను తీర్చటానికి శ్రీరామచంద్రుడు బాణంతో ఆ మాయలేడివెంట పడ్డాడు. లేడి ముందూ, రాముడు వెనుకా, అలా రాముడు దాన్ని తరుముతూ, పర్ణశాల నుండి చాలా దూరం వెళ్ళాడు. రాముణ్ణి, పర్ణశాలకు దూరంగా తీసుకెళ్ళటం, రావణుని పథకంలో ఒక భాగం. రావణుడు చెప్పినట్టు, మారీచుడు, ఆ పని చేశాడు.

చివరకు రాముడు బాణం వేశాడు. అది తగిలి ఆ మాయలేడి క్రింద పడింది. లక్ష్మణుని పర్ణశాల వద్ద లేకుండాచేయాలి. సీతాదేవి ఒక్కటే ఆ పర్ణశాలలో ఉండాలి. అప్పుడు రావణాసురునికి సీతను ఎత్తుకొని పోవటం సులభమవుతుంది. రావణ కార్యం పూర్తి అవుతుంది. అందుకని, ప్రాణాలు విడుస్తూ ఆ మాయలేడి "హా లక్ష్మణా" అని బిగ్గరగా పర్ణశాలవద్దనున్న సీతకూ, లక్ష్మణునకూ, వినిపించేటట్టు ఆర్తనాదం చేసి ప్రాణాలు విడిచింది.

ఆలా యీ పలుకుబడి వచ్చింది. "అలో లక్షణా" అని కూడా అంటుంటాం.




## అంపాపురం తాడి

సన్నగా, బారుగా, ఉన్నవాళ్ళపై కోపం వచ్చినప్పుడు "అంపాపురం తాడి" లా పెరిగావు అని తిడుతుంటారు.

అంపాపురం అనేది ఒక వూరిపేరు. అది గన్నవరం తాలూకా, కృష్ణాజిల్లాలో ఉంది. అది గరువు ప్రాంతం. తాడిచెట్లు పెరగటానికది అనువైన నేల. ఒకప్పుడు అక్కడ తాడిచెట్లు, తక్కిన ప్రాంతాలకనా సన్నగా, చాలా ఎత్తుగా పెరిగుండాలి. ఎక్కటానికి కూడా కష్టమైనంత పొడవుగా పెరిగి ఉండుంటాయి. అందువల్లనే ఆ తాడిచెట్లపై వచ్చిన యీ పలుకుబడి, వాడుకలో యీ నాటికీ ఉంది.

— పద్మావతీ గంగాధరి

# ఒక గొప్ప సంస్థయొక్క కథ

## ఏడు దశాబ్దాల పూర్వం ఆయుర్వేదం

ఆయుర్వేదం యొక్క ఉత్పత్తి వేద కాలం నాటిది. ఇది అధర్వణ వేదం యొక్క ఒక శాఖ యని నమ్మబడుచున్నది. సృష్టికర్త యైన బ్రహ్మ దక్ష ప్రజాపతికి ఈ విధానాన్ని బోధించినట్లు పురాణ ప్రసిద్ధి. దక్షుడు ఈ కళను, శాస్త్రాన్ని అశ్వినీ కుమారుల కిద్దరికి ఉపదేశించెను. వారినుంచి ఇంద్రుడు నేర్చుకొని భరద్వాజునికి తెలియజెప్పెను. భరద్వాజుని శిష్యులైన ఆత్రేయుడు, ధన్వంతరి తదితరులు దీనిని సంహితల రూపంలో విస్తరింప జేసిరి. ఏమయినా వైద్య శాస్త్రానికి ప్రాచీన బుషులచే దోహదం చెయ్యబడిన ఈ అపూర్వ విధానం తన మూలరూపంలో విశుద్ధతతో బహు కొద్ది చోట్ల భద్రపరచబడి యున్నది. వాటిలో మిక్కిలి ముఖ్యమైనది కేరళ. నిజానికి పిఛిల్, నవరకిజి, ధారా, గిరోవస్తి, స్నేహోపనం వగైరా వంటి కొన్ని బహువిఖ్యాతమైన ఆయుర్వేద చికిత్సలు కేరళలోనే జరుపబడుచున్నవి. అనేకమంది అల్లోపతి వైద్యులచే కూడ ప్రశంసించబడిన ఈ చికిత్సలు దూరదేశాల నుంచి కూడ కేరళకు రోగులను రప్పింప జేస్తున్నవి.

అయితే, ఏడు దశాబ్దాల వెనుక పరిస్థితి చాలాభిన్నంగా ఉండింది. దేశీయ వైద్య విధానాల పట్ల ఆనాటి వలస ప్రభుత్వానికి ఉండిన అలసత ఒక వైపు, అల్లోపతి వైద్యం పట్ల పలుకుబడితో కూడిన అభిమానం మరొక వైపు, వీటికితోడు ప్రజలయొక్క అశక్తత, ఆయుర్వేదన్ని అధోగతికి నెట్టివేయ్యడమే గాక దాదాపు నశింపజేశాయి.

## ఆయుర్వేద పునరుజ్జీవనం

అనేక పునరుజ్జీవనోద్యమాల ద్వారా, భారతజాతి ఆత్మాభిమానం ప్రస్ఫుటింప నారంభించటంతో ఆయుర్వేదానికి నూతన జీవం చేకూరింది. 1902 అక్టోబరు 12న తేదీన వైద్యరత్నం పి. ఎస్. వారియర్ కేరళ, కొట్టాక్కల్ నందు ఆర్యవైద్యశాలను స్థాపించిరి. ఈ సంస్థ ఆయుర్వేద పునరుజ్జీవనానికి, సంప్రదాయక వైద్యవిధానాన్ని కాలంతెచ్చిన మార్పులకు అనుగుణంగా అవలంభించటానికి మార్గదర్శి అయింది. వైద్యరత్నం పి. ఎస్. వారియర్ ఈ మహాత్కార్యాన్ని చెప్పటానికి అత్యంత అర్హులై యుండిరి. పండిత నాను ఊవన్ మూసాట్ వద్ద ఆయుర్వేదాన్ని సాకల్యంగా అభ్యసించి యుండిన వీరు దివాన్ బహదూర్ డాక్టర్ వర్గీస్ వద్ద అల్లోపతిలో కూడ గాఢ పరిజ్ఞానం గడించారు. ఆయుర్వేదాన్ని ఆధునిక అవసరాలను అనుసరించి అవగాహన చేసుకోవాలనే గాక ఆయుర్వేద పురోగతికి శాస్త్ర ప్రగతిని వినియోగపరుచుకోవలసిన అవసరాన్ని కూడ వీరు గ్రహించారు. ప్రాథమిక సూత్రాలకు భిన్నం కాకుండా శ్రీవారియర్ ఉత్తమ తరగతి నాణ్యతగల ఔషధాలను తయారు చెయ్యటానికి ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టారు. కొట్టాక్కల్ ఆర్య వైద్యశాల ఈ నాటికీ వ్యవస్థాపకుల యొక్క ఈ సాంప్రదాయాన్ని కొనసాగిస్తున్నది.

వేదమూలమైన ఆయుర్వేదానికి తదనుగుణంగా మానవసేవయే ధ్యేయం. పి. ఎస్. వారియర్ గారి జీవితం యావత్తు ఆ గమ్యానికే అంకితమై యుండింది. ఆయుర్వేద ఔషధాలను పెద్దఎత్తున తయారు చెయ్యటానికీ, నాణ్యత చెడకుండ వాటిని నిలవయుంచటానికీ రోగులకు క్రమపద్ధతిని చికిత్స జరపటానికి కూడ ఆయన మార్గదర్శకుడై యుండెను. ఈవిధంగా భారతదేశంలో ఆయుర్వేద పునరుజ్జీవనంతో ఆయన అవినాభావ సంబంధం కలిగియుండెనంటే అందులో ఆశ్చర్యం లేదు.

ఆర్యవైద్యశాల బ్రహ్మాండంగా అభివృద్ధి చెందింది. ఆయుర్వేదం యొక్క సత్ఫలితాలను వివిధ ప్రజలకు విస్తరింప జేసే నిమిత్తం 1916–1975 మధ్యకాలంలో దేశంలోని వివిధ ప్రాంతాలలో ఈసంస్థ 12 బ్రాంచి



వైద్యరత్నం పి. ఎస్. వారియర్

లను నెలకొల్పింది. ఇవిగాక కొట్టాక్కల్ నుంచి మందులు పంపకం చేస్తున్న ఏజన్సీలు, వందల స్టోర్లు 250కి పైబడి ఉన్నాయి. మలేసియా, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా, యూరోపు దేశాలనుంచి కూడ రోగులు ఆర్య వైద్యశాల ఔషధాలతో గుణం పొందుతున్నారు.

## ఆయుర్వేద కళాశాల

ఆయుర్వేదం యొక్క ప్రశస్తిని వ్యాప్తింప చెయ్యటానికి దేశంలో వివిధ ప్రాంతాలకు ఆయుర్వేద నిపుణులని పంపటం అతి ముఖ్యమని పి. ఎస్. వారియర్ గారు ఉద్బోధించే వారు. 1917 లో కాలికట్ నందు ఆయుర్వేదంలో 4 సంవత్సరాల కోర్సుతో ఆయుర్వేద కళాశాల స్థాపన వీరి దూరదృష్టి ఫలితం. ఈ కోర్సునందు విజయవంతముగా శిక్షణపొందిన వారు ఆర్యవైద్య పట్టీసికేటు పొందు చుండిరి. 1924 లో కొట్టాక్కల్ నందు ఆయుర్వేద వైద్యశాల స్థాపించినప్పుడు ఈ కళాశాల అక్కడకు తరలించబడింది. కాలికట్ విశ్వవిద్యాలయానికి అనుబంధితమై ఈ కళాశాల 1972 నుంచి బి. ఎ. ఎం. డిగ్రీని ఇస్తున్నది. ఈ కళాశాలయందు పరిశోధక ఉన్నతవిద్యకు సదుపాయాలు స్థాపించటానికి రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వం సహాయం చేశాయి. ఈ కళాశాల ఆయుర్వేద రసాయనాలు తయారు చెయ్యటానికి కావలసిన మొక్కలను మూలికలను పెంచే ఒక తోటను కూడ నిర్వహిస్తున్నది ఈ సంస్థలో చదివి వెళ్ళిన వారు అనేకులు నేడు లక్షలాది ప్రజల సేవలో నిమగ్నులై యున్నారు.



పి. కె. వారియర్ మేనేజింగ్ ట్రస్టీ



ఔషధములు తయారుచేయు ఆవిరి యంత్రము

## ఆయుర్వేద వైద్యశాల

కొట్టాక్కల్ నందలి ఈ ఉచిత వైద్యశాల 100 పడకలు సరుకులు బాగా ఉన్న ఒక ఔషధశాల కలిగియుంది. రోగులకు ఆయుర్వేద వైద్యనిపుణుల అల్లోపతి వైద్యనిపుణుల సలహాకూడ లభిస్తున్నది. దీనికి ఒక ప్రసూతి వార్డు కూడ ఉంది. కర్మ పంచ వార్డులో నవరకిళి పిళిచిల్ ధారా వగైరా కొన్ని ఖరీదైన చికిత్సలు పేదరోగులకు ఉచితంగా జరుపబడుచున్నవి. దీనికి 40 పడకల క్లినిక్ మరియు పరిశోధనవార్డు ఉంది.

ప్లాటినం జూబిలీ సందర్భంగా ఒకవర్కింగ్ హోములు తమ కుటుంబాలతో చేరియుండగల రోగుల కొరకు ఆధునిక సదుపాయాలతో తయారైనవి.

## ఆమోదము, గుర్తింపు

ఈ సంస్థల ద్వారా పి. ఎస్. వారియర్ గారు సాధించిన విజయాలు ఆయుర్వేదాభివృద్ధికి అపారంగా తోడ్పడినవి. అష్టాంగ శరీరం బృహచ్ఛరీరం అను రెండువైద్య గ్రంథాలను రచించటమే గాక వారియర్ గారు మళయాళంలో ఎన్నికైన నాటక రచయిత కూడ అయియుండిరి. పరమశివవిలాస అను డ్రమాటిక్ క్లబ్కు ఈయన ముఖ్య ప్రేరేపకులు, మార్గదర్శకులు అయియుండిరి. ఇది దరిమిలా కథాకళిని ప్రోత్సహించటానికి గాను పి. ఎస్. వి నాట్య సంఘంగా రూపొందింపబడింది. ఈ నాట్య సంఘము 1971 లో ఇండోనేషియాలో రామాయణ మేళా యందు భారతదేశానికి ప్రాతినిధ్యం వహిస్తూ, కథాకళిలో సంపూర్ణ రామాయణాన్ని ప్రదర్శించింది.

1932 లో భారత ప్రభుత్వం సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇండియన్ మెడిసిన్ను ఏర్పరచినప్పుడు పి. ఎస్. వారియర్ గారిని ఆయుర్వేదానికి వారు చేసిన సేవకు గుర్తింపుగా బోర్డు సభ్యునిగ నియమించింది. ఆ పిమ్మట వీరు దీనికి ఎన్నుకోబడిన సభ్యులయ్యారు. వీరు జీవితాంతం ఈ పదవిలో ఉండిరి. వీరికి వైద్యరత్నం బిరుదు కూడ ఇవ్వబడింది.

# ఒక గొప్ప సంస్థ

వైద్యరత్నం పి. ఎస్. వారియర్ గారు 1944, జనవరి 30, ఆదివారంనాడు తమ 75వ ఏడ సమాధినొందిరి.

తమ జీవితకాలంలోనే వీరు ఆర్యవైద్యశాలలను, ఇతర సంస్థలను దృఢమైన పునాదుల పైన ప్రతిష్ఠించి దక్షిణ భారతంలో వాటిని గొప్పవాటివిగ చేసిరి. తమ మరణశాసనంలో వీరు ఒక ట్రస్టును ఏర్పరచి ఆర్యవైద్యశాల నిర్వహణకు విస్పష్టమైన ఆదేశములు ఇచ్చియుండిరి. వైద్యశాల వ్యవస్థాపకులు నిర్దేశించిన మార్గమునకు కట్టుబడి సంస్థ కార్యకలాపములను విస్తరింపజేయుట ఈ ట్రస్టు యొక్క ప్రధాన లక్ష్యము.

వ్యవస్థాపకులు మరణ శాసనంలో నిర్దేశించబడినట్లు శ్రీ పి. ఎం. వారియర్ వైద్యశాల యొక్క మానేజింగ్ ట్రస్టీగను, ముఖ్య వైద్యులుగను నియమింపబడిరి. ఈ పదవులకు వీరు ఎంతయు తగియుండిరన్న విషయము కొద్దికాలంలోనే విశదమైనది. వీరు ఆయుర్వేద ఔషధములను తయారుచెయ్యుటంలో అనేక ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టి ఆర్యవైద్యశాల కార్యకలాపాలను ఇంకను పెంపొందించారు. కాని, ఈ సంస్థ స్వర్ణోత్సవాల మధ్య 1953, డిసెంబరు 12 తేదీన వీరు విమాన ప్రమాదంలో అకాల మరణం పొందారు.

పి. ఎం. వారియర్ గారి అనంతరం వీరి తమ్ముడు శ్రీ పి. కె. వారియర్ మానేజింగ్ ట్రస్టీగను, ఆర్యవైద్యన్ ఎన్. వారియర్ ముఖ్య వైద్యులుగను అయిరి.

ఆర్యవైద్యశాల ఏటేటా ఆయుర్వేదం మీద ఒక సదస్సును జరుపుతున్నది. ఈ సమావేశంలో సమర్పించబడు వ్యాసాలు పుస్తక రూపంలో ప్రకటించబడుతున్నవి.

దన్వంతరి యొక్క, వ్యవస్థాపకుల యొక్క ఆశీస్సులు, ఇందుకుతోడు ప్రజావిశ్వాసము మరియు మానవసేవకు అంకితమైన ఆర్యవైద్యశాల యొక్క సేవానిరతి దీనిని ఆయుర్వేద జ్యోతిని అన్ని దిశలకు విస్తరింప జేసే ఒక గొప్ప సంస్థగా వెలయింప జెయ్యటానికి తోడ్పడినవి.

**ఇతర వివరములకు జ వ ర ల్ మేనేజర్, ఆర్యవైద్యశాల, కొట్టక్కల్ – 676503, కేరళవారిని దయచేసి సంప్రదించండి.**

**ఏరీస్ అడ్వర్టయిజ్‌మెంటు బ్యూరో వారిచే పొందుపరచబడినది.**





**ధారామరియు పిజిచిల-నర్సింగ్ హోంలో జరుపబడుచున్న ఒక చికిత్స**





కొత్త నర్సింగ్ హోం

# వారఫలం

విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి.

**24-8-1979 శుక్రవారం మొదలు**
**30-8-1979 గురువారం వరకు**

**మేషం :** విధి విరామం ఎరుగని వారం. వ్యాపార విషయాలు, యంత్ర సంబంధమైన విషయాలు, మధ్య మధ్య జరిగిన చిన్న విషయాల్లో జోక్యం కల్గజేసికొనుటవల్ల ప్రొద్దు తనంతట తానే చాలక పోయిందని భావిస్తారు. కార్యభారం అధికం. స్త్రీలకు: గృహానందం కోసం శ్రద్ధ వహించటంలో కాలయాపన జరుగుతుంది.

**వృషభం :** పట్టుదలకు పోరాదు. ఉద్రేకంగా ప్రవర్తించుట మానుకోవాలి. మనస్సే కష్టసుఖలకు కారణం. నిగ్రహం ఎంతైనా అవసరం గద! క్షేమం కోరి, మీ బంధువులో, మిత్రులో చెప్పిన, మాటలు వినండి. వారి పద్ధతి ప్రకారం నడుచుకొండి స్త్రీలకు: మానసిక వికాసం, ఆదాయం సమకూడే వారం. 30 తా. సర్వానుకూలమైన తారీఖు.

**మిధునం :** చాలవరకు, ఆలోచించి, జాగ్రత్తగ మెలగే వారే మీరు. అయినా ఏదో పొరపాటు జరిగిందని అనుకొనే వారం. 26 తా. అన్ని విధాలా జాగ్రత్త వహించండి. వాహన ప్రమాదం ఉండవచ్చు. శుభకార్యాల గూర్చి ఆలోచన చేస్తారు. స్త్రీలకు: కార్యభారం ఎంత తగ్గించుకుంటే అంతమంచిది.

**కర్కాటకం :** ప్రయాణానుకూలత ఈరాశివారికి చాలమందికి చెప్పవచ్చు. విద్యాభ్యాసం చేసేవారికి మంచి అవకాశం గల దినం. దాయాదుల కీచులాటలు తలయెత్తే ప్రమాదం ఉన్నది. శుభకార్య వ్యవహారాలలో అనుకూల ఫలం పొందే అవకాశం ఉన్నది. ప్రయోజనం గల పరిచయాలేర్పడుతాయి. స్త్రీలకు: కొత్తగా నగలో వస్త్రాలో కొనే అవకాశం ఉన్నది.

**సింహం :** వారారంభం నుండి, చిత్రమైన సంఘటనల నెదుర్కొంటారు. బంధువులతో వాగ్వాదాలకు దిగవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి. జాగ్రత్త! తక్కిన విషయాలలో, సర్వానుకూలమైన వారం. 29 తా. శ్రమించి కొన్ని పనులు నెరవేర్చుకుంటారు. స్త్రీలకు: కీర్తి లభించే వారం.

**కన్య :** విశ్రాంతి లభించే వారం. కార్యభారం తగ్గేవారం. వారం వారం చేసే పనిలో వారఫలం సత్ఫలదాయకంగా పరిణమిస్తుంది. ఆరోగ్య విషయంలో శ్రద్ధాసక్తులు చూపాలి. మీ వెంటబడి పనులు నిర్వహించి, లాభం చేకూర్చమని కోరే వారిని తృప్తి పరచటం న్యాయమే. స్త్రీలకు: కొన్ని ముఖ్య విషయాలలో లాభదాయకం.

**తుల :** గృహ విషయాలలో ఉదాసీనంగ ఉండకండి. ఎంత జాగ్రత్త వహించితే అంత మేలు. ఒకరిద్దరు కుటుంబ సభ్యులు మిమ్మ వ్యతిరేకించనున్నారు. రాబోయే ఇబ్బందులను గ్రహించి మెలగటం అవసరం గద! స్త్రీలకు: ఆదాయంలో, అభివృద్ధిలో లోటుపాట్లుండవు. ఆరోగ్యం సామాన్యం.

**వృశ్చికం:** తోటి వారికి సాయం చేయాలనీ, సంఘ సేవ చేయాలనీ, బంధువులకు తోడ్పడాలని, ఏవో ఆలోచనలతో వారం గడుపుతారు. అనుకున్నట్లు సహాయ కార్యక్రమం నెరవేరే గ్రహచారం లేదు. ప్రయత్నాలకు అంతరాయాలుంటాయి. ఆదాయం సామాన్యం. స్త్రీలకు : ద్రవ్యాదాయమున్నది.

**ధనుస్సు :** కార్యాచరణయందు దీక్ష వహించండి. నిబ్బరంగా ముందుకు సాగిపోండి. మీ మంచితనం సర్వవిధాలా మీకు తృప్తిని, ఆనందాన్ని సమకూరుస్తుంది. మీ కోరికప్రకారం పనులు జరిగిపోవాలని ఆశించటం, అనుకూలత లేనపుడు, న్యాయం గాదు. స్త్రీలకు: సర్వవిధాలా అనుకూలత ఏర్పడుతుంది.

**మకరం :** ముందుగా ఒక ప్రణాళిక సిద్ధం చేసికొనక, పూర్వాపరాలు ఆలోచించక, కార్యరంగములో దూకడం మంచిది కాదు. ఎప్పుడో రావలసిన ద్రవ్యం ఈ వారంలో చేతికందటం జరుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు రావటంలో కూడ ఈ వారం ఆశ్చర్యపడనక్కరలేదు. స్త్రీలకు : తలంచిన పనులు సులువుగా నెరవేరే అవకాశాలు లేవు.

**కుంభం :** మిత్రులు కలిసికొంటారు. వారితో తీవ్రంగా ఒకానొక వ్యాపార విషయమై సంప్రదించి, రంగంలో దిగి, కృతకృత్యులవుతారు. ప్రయాణానుకూలత సంభవం. ప్రశాంతంగా పనులు నెరవేర్చుకొంటుగుతారు. ఆరోగ్య లోపం కనిపిస్తుంది. వెంటనే జాగ్రత్త వహించటం మేలు. స్త్రీలకు: వయస్సు మళ్ళిన వారు చాల జాగరూకత వహించవలసినవారం.

**మీనం :** అనుకూల ప్రదమైన వారం. చాల విధాల లాభదాయకం. ఆశ వదలిన పనులు నెరవేరటం, అసలు చేతికందదన్న ద్రవ్యానుకూలత సంభవించటం, ఆరోగ్యం బాగుండటం, తలంచిన పనులకు ఆటంకాలు రాకుండుట, ఈ వారం ప్రత్యేకత. స్త్రీలకు: అభివృద్ధి, ఆదాయం, అనుకూలత సంభవించుటే ఈ వారఫలంగా భావించాలి. 29 తా: సర్వానుకూల ప్రదమైన దినం. ●

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.

నైసిల్
ఉపయోగించండి.
అతిశీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడరు

చెమటకాయల పౌడర్
మాత్రమే మీకు దురదలు, మంటల
చికాకుల నుండి అతి శీఘ్రంగా
ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్
చెమటకాయలను ప్రతి దశలోనూ
ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను అపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

2 ప్యాక్‌లలో
దొరుకును —
"బ్లూ" మరియు
"శాండల్ వుడ్"

nycil
PRICKLY HEAT POWDER

**నైసిల్ పొందండి.**
**చెమటకాయలను మరువండి.**
**కేవలం 6 రూపాయల 63 పైసలు.***

*గరిష్ఠ రీటైల్ ధర. స్థానిక పన్నులు అదనం

Sista's-GN-79-364-Tel

# మంత్రికి విడాకులు!

బీహారు రాష్ట్ర పబ్లిక్ వర్క్సు మంత్రిణి కమలా దేవి భర్త తాను తన భార్యచే నిర్లక్ష్యం చేయబడుతున్నట్టు ఫిర్యాదుచేసి, కోర్టులో విడాకులు కోరారట. తన భార్య రాజకీయాలలో చొరబడి భార్యగా తన విధుక్తధర్మాలను గత ఐదేళ్ళుగా విస్మరిస్తూ వచ్చినా తానిన్నాళ్ళూ ఓర్చుకున్నాననీ, ఇక ఓర్చుకోలేననీ ఆయన కోర్టుకు విన్నవించుకున్నాడట.

## సంగీతానికి స్వస్తి!

ఇరాన్ మతాధినేత అయతుల్లా రుహొల్లా ఖొమైని సంగీతానికి నల్లమందుకు తేడాయే లేదని, ఈ రెండూ మనిషిని మత్తులో ముంచేస్తాయని తెలియజేసి అందువల్ల రేడియోలలోనూ, టి. వి.ల లోనూ సంగీతం ప్రసారం చేయరాదని ప్రకటించారట. అంతతో ఊరుకోక, అబ్బాయిలూ అమ్మాయిలూ కలిసి ఒకేచోట స్నానాలు చేయరాదని కూడా ఆయన ప్రకటించారట.

## సమ్మెకి కారణం బొమ్మ!

తమిళనాడుకు చెందిన శివకాశిలోని ఓ అగ్గిపెట్టెలు తయారు చేసే ఓ ఫ్యాక్టరీలో ఓ చక్కని నగ్నసుందరి బొమ్మ నలుగురికీ కనపించే చోట పెట్టారట ఫ్యాక్టరీ యజమానులు. ఆ బొమ్మని చూస్తూ పనివారంతా ఎక్కువ హుషారుగా పని చేసుకు పోతున్నారట. ఆ ఫ్యాక్టరీకో కొత్త మేనేజరు మొన్నీమధ్యవచ్చి ఏమిటి వెధవ బొమ్మని అరవంలో విసుక్కుని, ఆ బొమ్మని తీయించేసేసరికి, ఆ ఫ్యాక్టరీ పనివారు టక్కున సమ్మె చేశారట. అనుకోని ఈ సమ్మెకు కారణం తెలియని యాజమాన్యం బాబూ, మీ కోర్కెలేమిటి? [illegible] కావాలా, బేటా కావాలా, అధిక బోనసులు కోరుతారా, ఇంకేమైనా హిరణ్యాక్షవరాలు కోరదల్చుకున్నారా అని అడిగితే వారంతా ముక్తకంఠంతో మాకినేమీ వద్దు. తీసేసిన నగ్నసుందరి బొమ్మ అదే చోట పెట్టాలి అంతే అన్నారట. దానికా మేనేజరు గారు దిగ్భ్రాంతి చెంది, చేసేదిలేక తిరిగి ఆ బొమ్మను తెచ్చి తానే ఆ చోటులోనే వ్రేలాడదీశాడట.



## తిమ్మప్ప కామదాహం!

తమిళనాడుకు చెందిన పాట్టమ్పళ్ళి అనే గ్రామంలో క్రిష్ణప్ప అనే అతని భార్య చిన్నమ్మ చలా అందకత్తెట. ఆమె మీద క్రిష్ణప్ప తమ్ముడు తిమ్మప్పకు కోర్కె పుట్టి ఇంట్లో ఎవరూ లేనప్పుడు వంట చేస్తున్న వదిన గారి వద్దకు వెళ్ళి గమ్మున మోసం కౌగిలించుకుని క్రిందపడేసి, బలాత్కరించబోయాడట. చిన్నమ్మ ఈ సంఘటనకు నిశ్చేష్టురాలయి, తేరుకుని వద్దు వద్దని అరవంలో ఆక్రోశించి, అతన్ని విడిపించుకుని పారిపోబోయేసరికి ఆగ్రహంతో ఆ తిమ్మప్ప కత్తి తీసుకుని ఆమె గుండెలోనూ, పొట్టలోనూ కంఠంలోనూ కసిదీరా పొడిచి చంపేశాడట.

## పుణ్యానికి పోతే....

సుమారు 20 మంది భక్తులు ఉడిపి శ్రీకృష్ణుని, తదితర యాత్రలూ చూసుకుని బెంగుళూరు తిరిగి వెళుతుండగా 20వ తేదీ తెల్లవారు జామున ఓ లారీ వారి టెంపోను గుద్దబోయేసరికి డ్రయివరు అది తప్పించే ప్రయత్నం చేశాడట. దాంతో ఆ టెంపో తిరిగి ఓ పెద్ద నేలబారు మోటబావిలో పడిపోయిందట. అందరూ చనిపోయారట, ఒక్క డ్రయివరు తప్ప.

## కొజ్జాల విజ్ఞప్తి!

యు. పి.కు చెందిన కొంతమంది కొజ్జాలు రాష్ట్రపతికొక లేఖ వ్రాశారట. అందులో వారు తమ కొజ్జాజాతివారందరూ ఒకే పార్టీగా ఏర్పడి సుస్థిర ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి సమ్మతించమని కోరి. తమ పార్టీలో అందరూ కొజ్జాలే అవడం వల్ల కొడుకుల, అల్లుళ్ళ అవినీతుల ప్రసక్తి రానే రాదని వారు విన్నవించుకున్నారట.

## మలేరియా ప్రగతి!

ఓ పదేళ్ళ క్రితం మనదేశంలో మలేరియా వల్ల చనిపోయిన వారి సంఖ్య అరవై వేలట. ఈ ఏడు లెక్కలవల్ల మలేరియాలో ఈ ఏడు చనిపోయినవారు అరవై లక్షలని తేలిందట. వైద్యవిజ్ఞాన శాస్త్రం అప్పటికీ, ఇప్పటికీ నాటికి నాటికి పెరిగిందని ఆనందిస్తుంటే ఈ మలేరియా చావులు కూడ నాటికి నాటికి పెరిగాయంటే ఏమనాలి!

## ఎలుకను చంపినందుకు పెద్ద శిక్ష!

తమిళనాడుకు చెందిన కాకుట్టి అనే గ్రామంలో పొన్నయ్యన్ అనే ఆసామీ ఓ ఎలుకను చంపాడట. ఆ గ్రామంలో ఎలుకను దేవతగా పూజించడం వల్ల ఆ గ్రామవాసులంతా పొన్నయ్యను దేవతా హంతకునిగా ఎంచి, ఓ సంవత్సరకాలం గ్రామ బహిష్కరణ చేసి ఓ బ్రాహ్మణునికి వెండి ఎలుక దానంచేసి, గ్రామం వదిలి ఓ సంవత్సరం పోవాలని, తిరిగి రాదల్చుకుంటే ఆ గ్రామానికి నూటఎనిమిది ఎలుకలను తీసుకువచ్చి గ్రామాధికారులకు అప్పగించాలనీ తీర్పు చెప్పారట —

## పెళ్ళివారి పెట్టెలో పోలీసులు!

ఉత్తరభారతదేశం నుంచి దక్షిణభారత దేశం మద్రాసుకు వెళ్తున్న ఓ రైలు ఇటార్సీ జంక్షనుకు రాగానే ఓ నలుగురుపోలీసులు ఒక మ్యారేజి పార్టీ ప్రత్యేకంగా తీసుకున్న కంపార్టుమెంటులోకి బలవంతంగా ఎక్కారట. అనక మరి కొంతమంది పోలీసులుకూడా ఎక్కారట. రైలు కదిలాకవారు ఆ పెళ్లివారిని ఎగతాళి చేయడంతో ఆరంభించి, వారినందరినీ చితకబాది, రెండు పెట్టెలు, చేతికి అందిన నగలతో పారిపోయారట.

## ప్రేమయాత్రలో పలాయన మంత్రం!

ఓ యువదంపతులు ప్రేమయాత్రలు చేస్తూ చేస్తూ వార్ధా చేరి అక్కడి ఓ సరస్సు చూసి ముచ్చటపడి, ఆ సరస్సులో నగ్నంగా జలక్రీడలాడాలని సంబరపడి అంతపనీ చెయ్యనారంభించారట. ఇదిచూసిన ఆ ఊరి ఆడువారు సిగ్గులేని ఆ జంటను చంపెయ్యాలని తీర్మానించుకుని, నిర్దాక్షిణ్యంగా కర్రలతో బాది చంపాలా, లేక నీటిలో ముంచి చంపాలా అని నిర్ణయించుకునేలోగా వారివారి భర్తలు పరుగున వచ్చి ఈ హత్యలు మనకేల, వారిని ప్రభుత్వానికప్పగిస్తే వారే శిక్షిస్తారని నచ్చచెపుతూ వుండగా ఆ జంట [illegible] అని పారిపోయారట.



నవరక్తిని, నవశక్తిని కలిగించే

# నెస్‌కాఫే®






ప్రపంచంలోకల్లా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ

నూటికి నూరుపాళ్లు స్వచ్ఛమైన కాఫీతో
తయారయ్యే ఒకే ఒక ఇన్‌స్టెంట్ కాఫీ

NS/CAS-3/79 TEL

# నళిని

## చిట్టారెడ్డి సూర్యకుమారి

(గత సంచిక తరువాయి)

వాసవిని పిల్లలు చుట్టేశారు.

పావని పవిత్ర చూపించే అనురాగంతో, నళిని నీడలో వెన్నట్టు వుండి, అజయ్‌తో కలసి చూసిన సైట్ సీయింగ్‌లతో సూర్యున్ని కప్పిన మబ్బులా చల్లబడింది వాసవి హృదయం దుఃఖం చాలవరకు ఉపశమించింది.

మధ్యాహ్నం విశ్రాంతి సమయంలో పిల్లలు దొంగనిద్ర నటించి డాడీ ఆ ప్రక్క లేనిది చూసి మెల్లిగ పైకి వచ్చారు. నళిని నిద్రపోటానికి ప్రయత్నిస్తుంది. పిల్లలు కెలికిపెట్టిన సూట్ కేస్ ముందేసుకుని కూర్చుంది వాసవి.

నళిని ఆ ప్రక్కకు తిరిగి, "వాసూ! ఆ పెట్టె అలాగే వుండని. ఒకేసారి వెళ్లేటప్పుడు సర్దుకోవచ్చు. ఎందుకొచ్చిన అవస్థ" అంది.

అప్పటికే పెట్టెలోని వస్తువులన్నీ బయట పెట్టేసింది. అంతలోకే పిల్లల్లా పిల్లలు పైకొచ్చేశారు. పవిత్రకి పనికివచ్చే వస్తువులు ఏమి లేనందున నళిని ప్రక్కజేరి విరిగిన కారు బొమ్మని రిపేర్ చేస్తున్నట్టు మరికాస్త విరగ గొట్టుతున్నాడు. పావని వాసవి ప్రక్కజేరింది. రిబ్బన్లు, సెంటు, కంటికి నచ్చినవన్నీ అప్పటికే తీసి దాచేసుకుంది. తను చూడని లిప్‌స్టిక్ కనుపించేసరికి తీసి చూసింది. "ఆంటీ ఈ షేడ్ బాగుంది."

"బాగుందా తీసుకో."

ఎవ్వరేది బాగుంది అని మెచ్చుకుంటే, 'కావాలా, తీసుకో' అనే తత్వం గలది. పావని అది తీసుకుని తూనీగలా పరుగెత్తింది.

రాజకుమారి లిప్‌స్టిక్ పట్టుకొని పైకి వచ్చి వాసవి ముందుంచి, "పిల్లలకి తెలిసో, తెలియకో ఏదో అడుగుతుంటారు. అడిగినవన్నీ ఇచ్చివేయటమే! రేపు ఎవ్వరైన అడిగితే నీ మొగిడ్నికూడా ఇచ్చేసేలాగున్నావు" అంది

కళ్ళు మూసుకున్న నళిని, "ఎక్కడైన, బావ, వంగతోట దగ్గర మాత్రం కాదు... ఆ రేపు పెళ్ళయితే ఆడ ఈగను కూడా వాలనివ్వను" అంది.

"నీ మనసులో మాట నీవంటున్నది" అంది.

"నేను, నీవు ఒకటేగా" అంది ఈ వైపుకు తిరుగుతూ.

పవిత్ర వున్నట్టుండి, "నేను పెద్దయినాక వాసవిని పెళ్లి చేసుకుంటాను" అని ఇంగ్లీషులో అన్నాడు.

వాసవి నవ్వింది.

"నీవు వచ్చింద్రి, పోయింద్రి అని మాట్లాడితే, అది చచ్చినా చేసుకోదు. అది నూరు పైసల ఆంధ్ర వనిత" నవ్వును దాచుకుంటూ అంది నళిని.

పవిత్ర ముఖం చిన్నబుచ్చుకొని "ఈజ్ ఇట్" అని వాసవిని ప్రశ్నించాడు.

రాజకుమారి నవ్వుకుంటూ వెళ్ళింది.

వాసవి చేతులు చాచింది. పవిత్ర చేతుల్లోకి వెళ్ళాడు. ముద్దుపెట్టుకొని చెవిలో ఏదో చెప్పింది వాసవి.

నవ్వుతూ వచ్చిన భార్యతో "ఏంటి" అని అడిగారు రావుగారు.

చెప్పింది.

నుదురు కొట్టుకున్నాడు. "నా పిల్లలు పాడైపోతున్నారు. నీ చెల్లెండ్రని పాక్ చేసి పంపేయ్" అన్నాడు సీరియస్‌గా. రావుగారి కోపం చూసి పక పక నవ్వింది రాజకుమారి.

"ఈ రోజు ఎక్కడికి వెళ్తున్నాము?" ఉత్సాహంగా అడిగాడు పవిత్ర.

"గైడు ఇంకా ఏమి చెప్పలేదు." నళిని సీరియస్‌గా అంటే వాసవి నవ్వింది.

"గైడ్? ఆ... అంకుల్ అజయ్" అన్నాడు.

"ఓర్నీ..."

"ఐ థింక్ హి ఈజ్ ఇన్ లవ్ విత్ యు" చొక్కా గుండీలు పెట్టుకుంటూ అన్నాడు.

అమ్మాయిలిద్దరూ కళ్ళు పెద్దవి చేశారు.

"ఈ ఇంగ్లీషు బడులు చదివే పిల్లలకి అన్నీ తెలిసిపోతాయి, ఇంతప్పడే" అన్నట్టుగ చూపులు మార్చుకున్నారు.

"నళినీ! సాలార్‌జంగ్ మ్యూజియమ్‌కి పోదామా?"

పవిత్ర మరి మాట్లాడ్డానికి సమయం ఇవ్వకుండ, అన్నాడు.

"బోర్ ఆంటీ."

"ఔను, ఏం చూస్తాం... జహంగీర్ సొరాకప్పు, నూర్జహాన్ బాకు, టిప్పుసుల్తాన్ — కుర్చీలు, ఔరంగజేబు కత్తి..." పకపక నవ్వింది

"వీల్డ్ రేచల్‌ది మార్‌బల్‌స్టాచ్యు చూశావా ఆంటీ" అన్నాడు పవిత్ర.

"చూశాం కదా! వాసవీ! మరో చెక్కలో ఒకవైపు మగవాడు. మరోవైపు ఆడది." అని నళిని అంటే,

"ఆ... యస్ ఫ్రంట్‌లో మెహిస్టోఫెలిస్, బ్యాక్‌లో మార్‌గరేటా."

'మమ్మీ వాండ్లు ఎక్కడికి వెళ్తున్నారు' ఎందుకైనా మంచిది అని వాండ్లు ఏ వైపుకి వెళ్ళారు" అడిగి తెలుసుకుంటానంది నళిని.

"మేజర్ పాప్లిన్ ఇంటికి వెళ్తారని అనుకుంటున్నారు."

నళిని వాసవి అమ్మ దగ్గరకి వెళ్తున్నాం అని చెప్పి ఇక్కడనుంచి బయలుదేరి అజయ్‌తో ఎక్కడెక్కడో తిరిగి వచ్చేవారు. పైకి ముఖర్జీ ఇంటికి వచ్చినట్లు వచ్చి క్రిందనే వుండిపోయేవాడు అజయ్. ఒకసారి వచ్చినప్పుడు నళినిని పరిచయం చేసింది రాజకుమారి. మొదటిసారి చూస్తున్నట్టు నమస్కారాలు మార్చుకున్నారు. అంతకుముందే రావుగార్లతో పరిచయమేగాక స్నేహంకూడా వుంది. ఇక నళిని రాకతో అజయ్ రాకపోకలు ఎక్కువైనవి. ఆ సొసైటీతో ఆడ మగ, నిర్మలంగ స్నేహపాత్రతో ఫ్రీగా మెలగటం అలవాటే. కనుక అమ్మాయిలతో జోక్స్ వారితో షికార్లుకు వెళ్తున్నా మరో విధంగ భావించలేదు రాజకుమారి.

ఒకటి రెండుసార్లు నళిని అజయ్‌తో చనువుగా వుండటం చూపులు కనిపెట్టిన నళిని వదిన గుంభనంగా వుండిపోయింది. ప్రత్యేకమైన వాఖ్యానాలు, అర్థాలు తీయలేదు. తనకు కావలసింది అది. ఈ కాలం ఆడపిల్లల పెళ్ళి చేయాలంటే అదో ప్రాణసంకటమైన పని, ఇలా ప్రేమలో పడి వివాహం జరిగిపోతే కట్నం బాధ తప్పుతుంది. రాజకుమారి ఫోన్ చేసినప్పుడు ఆ సమయంలో ఇంట్లో నళిని, వాసవి లేకపోతే ఏదో సర్ది ఇప్పుడే ఎక్కడికో వెళ్లారు అని చెప్పేది

తను తప్పు చేస్తున్నానేమోనని వసుంధర తర్కించుకోకపోలేదు. తప్పటడుగు వేసే టీనేజ్ కాదు. చదువుతోపాటు లోకజ్ఞానం వుంది. పైగ ఎప్పుడు స్నేహితురాలు వుండనేవుంది అని సరిపెట్టుకుంది వసుంధర.

ఆ రోజు సికిందరాబాద్, హైదరాబాద్‌ను కలుపుతున్న హుసేన్‌సాగర్ సరస్సు దగ్గర చేరారు ఆ టాంక్‌బండ్‌మీదున్న సిమెంటు బెంచీలపై కూర్చుని, వచ్చేవారిని రోడ్డుపై వెళ్లే వాహనాలను చూస్తున్నారు. అప్పుడే రెండుసార్లు ఐస్‌క్రీమ్‌లు తినటమయినది. అక్కడ ఓ సర్దార్‌జీ తన మనమడితో ఆ సిమెంటు పేవ్‌మెంటుపై షికారుగా నడిచివస్తు అజయ్‌ను చూసి పలకరించాడు. అజయ్ చేతిలో చెయ్యి కలిపి, హృదయపూర్వకంగా, గౌరవంగా ఆ సర్దార్‌జీతో యోగక్షేమాలు మాట్లాడి నవ్వుముఖంతో చూస్తున్న అబ్బాయిని, భుజంమీద కొట్టి పలుకరించి, 'చదువుతున్నావా? మమ్మీ, గ్రాండ్ మా బాగున్నారా? అని' వారిని చూసి చాలా రోజులైందని, పెద్ద సర్దార్‌జీతో అన్నాడు.

"భగవంతుని దయవలన బాగున్నారు నాయనా" అని హిందీలో చెప్పాడు. తాత మనవడు వారిని దాటిపోయారు.

**జరిగిన కథ-5:** తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్డారు వాసవి, నళినిలు. తరువాత వాసవితో కలిసి వాళ్ళవూరు వెళ్తుంది నళిని. అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది. కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలిసి వాసవి, నళినిలు లేపాక్షి వెళ్లి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు. అక్కడినుండి హైదరాబాద్‌లోని తనవాళ్ళ దగ్గరకు వెళ్తుండగా, రైల్వేస్టేషన్‌లో పరిచయమైన కెప్టెన్ అజయ్, తనని ప్రేమిస్తున్నానని చెప్పగా ఆశ్చర్యపోతుంది నళిని. తన తండ్రి మరణించగా, నళిని యిచ్చిన టెలిగ్రామ్‌ను అందుకొని అక్కడకు చేరుతుంది వాసవి.

''తాతా! ఆ అంకుల్ కాప్టెన్ కదా! నేను ఆర్మీలో చేరిపోతాను. నీవు గ్రాండ్ మా ని ఒప్పించు.'' పన్నెండేళ్లుకూడా లేని ఆ పిల్లాడు అంటున్నాడు.

అజయ్ సిదానంగా అబ్బాయినే ప్రశంసాపూర్వకంగా కనిపించేంతవరకు చూస్తూనే వున్నాడు.

''మీ కొడుకునికూడా ఆర్మీలో చేర్పిస్తారా?'' అని వాసవి హాస్యమాడింది అజయ్‌తో.

''ష్యూర్'' అంటూ నళిని వైపు చూశాడు. నళిని కళ్ళు క్రిందకి వాల్చేసింది.

''ఆ సర్దార్‌కి ఒక్కడే కొడుకు. చైనా యుద్ధంలో చనిపోయాడు. అందమైన అతని భార్యకి ఇరవై సంవత్సరాలు కూడా లేవు. ఆ అమ్మాయి వారి తల్లిదండ్రులకి ఒక్కతే కూతురు. విధవైన ఆ కూతుర్ని వెంటనే ఇంటికి తీసుకెళ్ళిపోయారు. అమ్మాయి మూడో నెల గర్భిణి. కన్నకూతురి నూరేళ్ళ జీవితం మోడుగ వుంచటం వారి మనస్సు అంగీకరించక, గర్భాన్ని తీసివేయాలనుకున్నారు. డాక్టర్ దగ్గరకు వెళ్తున్నప్పుడు ఈ సర్దార్‌జీకి ఎలాగో తెలిసింది. ఉన్న ఒక్క కొడుకు చనిపోయాడు. ఇక ఆ వృద్ధులకు ముందు వెనుక ఎవ్వరూ లేరు. ఆ సర్దార్‌జీ కోడలి కాళ్ళ ముందు వంగి అతని తలపాగ కాళ్ళ క్రింద వుంచి, పుత్రభిక్ష పెట్టమని ఏడ్చాడు. ఆ కోడలు, భ్రూణవిచ్చేదానికి వప్పుకోక అత్తమామల దగ్గరకు వచ్చేసింది. ఆ పసిగుడ్డు ఆ వెళ్తున్న అబ్బాయి. ప్రభుత్వం వారికి గ్యాస్ ఏజన్సీ యిచ్చి, వారికి సహాయం చేసింది. ఆ అమ్మాయి చదువుకొని టీచర్‌గా పని చేస్తోంది ... పంజాబ్‌లో మృతవీరులులేని ఇల్లు ఒక్కటీ లేదంటే ఆశ్చర్యపడవలసినపని లేదు...'' భారంగా పలికింది నళిని.

అంతవరకు నీళ్ళల్లో ఆడి పిల్లలు తిరిగి వచ్చారు. ''అంకుల్, నెహ్రూ బాలభవన్‌కి వెళ్ళి బోటు షికారు చేద్దాం'' అంటూ గొడవ మొదలు పెట్టారు.

ఆటోరిక్షాని పిలుచుకొచ్చాడు. పిల్లలు ఒక్క దూకులో ఎక్కారు. వాసవి ఎక్కింది. అజయ్ ముందుకువచ్చి ఆటోని ఎక్కడికి పోవాలో చెప్పాడు. ఎక్కను వెళ్తున్న నళినితో ఆటోరిక్షా అతను, ''నల్గురిని ఎక్కించుకోను. అక్కడ పోలీసు వూరుకోడు'' అంటూ స్టార్టుచేసుకుపోయాడు.

వెళ్తున్న ఆటో వైపు ఆశ్చర్యంగా చూస్తున్న నళినితో, 'కమాన్' అంటూ ముందున్న స్కూటర్‌వైపు దారితీశాడు.

''వాళ్ళేమనుకుంటారు ?'' అంది.

''ఎవ్వరు ?'' అంటూ కన్నులు ఎగురవేశాడు.

''నాకు భయం – మెల్లిగా పోవాలి'' అంటూ వెనుక కూర్చుని సీటును పట్టుకుంది, అజయ్‌కి తగలకుండా జాగ్రత్తపడుతూ...

కాస్తదూరం పోయి స్కూటర్ వంకర తిరుగుతూ జర్కు యిచ్చింది. ''కెవ్వు''మంటూ రెండు చేతులతో అజయ్ వీపుని గట్టిగాపట్టుకుంది.

''అయ్యో అయ్యో నన్ను ముట్టుకుంటున్నావు. తాకకు. తప్పుకదూ ?'' అన్నాడు పకపక నవ్వుతూ. వీపుమీద గుద్దింది.

''పడతావ్, జాగ్రత్తగా పట్టుకో'' అంటూ నళిని చెయ్యి తీసి నడుంచుట్టూ వేసుకొని, 'ఇలా పట్టుకోవాల' అన్నాను.

''రోజా పరిమళం'' అతనిలో నుండి వస్తోంది. అదేం సెంటు అనుకుంది. ఆ సువాసనలతో పాటు అతని శరీరం అయస్కాంతంలా ఆకర్షించసాగింది. వీపుమీద సుతారంగా వాలింది.

నళినిని అలాగ వీపుమీద ఎక్కించుకొని ఎక్కడికో ఎవ్వరూలేని దూరతీరాలకి వెళ్ళిపోవాలని వుంది.

బంగారురంగు ఎర్ర బార్డర్ చీరలో అస్తమిస్తున్న సూర్యబింబంలా వుంది. ప్రేమకి ఆకర్షణ తోడైతే హృదయం అల్లరిపెడుతుంది. ఈ అమ్మాయిని చూడకుండా నిమిషంకూడా వుండలేననుకున్నాడు. ప్రతి రాత్రి – ఈ రాత్రి యెప్పుడు గడుస్తుందా ? రేపు నళినిని యెప్పుడు చూస్తానా ? అని అనుకుంటూనే కలతనిద్ర పోతాడు. 'నళినిని త్వరగా స్వంతం చేసుకోవాలి' అని తీర్మానానికి వచ్చాడు.

వీలైనంతమెల్లిగాపోసాగాడు. బస్సుస్టాపులో బస్సుకొరకు యెదురుచూస్తున్న వృద్ధ దంపతులు ఆహ్లాదంగా, ఆంబోతులాగా విలాసంగా వస్తున్న అజయ్‌ని అంతదూరంలో చూసి, ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. సరిగ్గా వారి ముందు నుంచి పోతూ, అప్పుడే వారిని గుర్తించినట్టు చూశాడు. ముసిముసిగా నవ్వుతూ దగ్గరకి వచ్చి ఆపాడు.

''నళిని దిగు'' అని మెల్లిగా మృదువుగా చెప్పాడు. ఎదురుగావున్న వృద్ధులను కళ్ళు విప్పారించి చూసింది.

అతను పొడుగ్గా, లావుగా తెల్లబడిన జుట్టుతో వున్నాడు. ప్రసన్నవదనంతో ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. చేతిలో వాకింగ్ స్టిక్, తెల్ల పాంటు, తెల్ల చొక్కా, పెద్ద ఉద్యోగంచేసి రిటైర్ అయిన ఆఫీసర్‌లా వున్నాడు.

అతని భార్య తెల్లజుట్టుతో అక్కడక్కడ పాయలా నల్లని జుట్టుముడి. అతనికి సరిగ్గా భుజాల క్రిందుగా వుంది. పొట్టిగా, సన్నగా వుంది. బార్డర్‌లేని ఏనుగురంగు వెంకటగిరి చీర, అదే రంగున్న రవికె వేసుకుంది. చెవులకి తెల్లరాళ్ళ కమ్మలు. నుదుట కుంకుమబొట్టు. చేతులకి బంగారుగాజులు, మంచి రంగు, ఆవిడ నిలబడిన తీరు, చూస్తున్న విధం బాగా చదువుకొన్న మనిషిలా వుంది. జేబుల్లో చేతులు పెట్టుకొని నిల్చున్న అజయ్‌ను చూసి,

''వెల్ మై సన్'' అని పలుకరించాడు ఆయన.

''మీట్ మై గర్ల్, నళిని'' అంటూ ఆ వృద్ధుని కళ్ళలోకి అర్థవంతంగా చూసి పెద్దగా నవ్వాడు అజయ్.

వృద్ధ వనిత నిశితంగా నళినిని చూస్తూ వుంది. చూడనిచ్చి, అజయ్, ''నళిని. వీరు డాక్టర్ శంకర్, వారు డాక్టర్ గౌరి'' అని పరిచయం చేశాడు. నళిని ఆ ఇద్దరికీ నమస్కరించింది అజయ్ ఆమె దగ్గరగా వెళ్ళి భుజం చుట్టూ చెయ్యి వేశాడు.

''ఊ ... పెద్దవాడివైపోయావు...'' కినుకుగా అంది. దొంగకోపం నటిస్తూవుంది. ఆమె ముఖం సంతోషంగా వుంది



# న ళి ని

''ఏం ..దువుతున్నావు ?'' అంది.

నళిని చెప్పింది. నళిని కంఠం మృదువుగా ఏ..సొంపుగా వుంది. అంతలో వారెక్కవలసిన బస్సు వచ్చింది. అక్కడికి పోతూ, ''ఇంటికి తీసుకురా'' అం.. వృద్ధుడు చేతులు వూపాడు. బస్సు కదిలింది. అజయ్ చేయి వూపాడు. నళినినే మాస్తున్న ఆ వృద్ధదంపతులు చేతులు వూపారు.

''వాళ్ళు ఎవ్వరు ?'' అంది నళిని.

''మా అమ్మా, నాన్న'' అన్నాడు.

నళిని కళ్ళు మరీ మరీ విచ్చుకున్నాయి.

''అలా మాడకు ముద్దుపెట్టుకోవాలని పిస్తుంది'' అన్నాడు అజయ్.

* * *

తొమ్మిది, పదిగంటల మధ్య అజయ్ స్కూటర్‌లో ఎక్కించుకుని వచ్చిన అమ్మాయిని చూసి గౌరి, శంకరులు ఒకరి ముఖాలు ఒకరు మాసుకున్నారు. స్కూటర్ నుండి దిగిన అమ్మాయితో అజయ్ ఇంట్లోకి వెళ్ళమన్నట్లు సైగచేసి స్కూటర్ వెనక్కి తిప్పుకుని వచ్చినతోవ పట్టాడు. గదిలోవున్న భార్యాభర్తలు 'నిన్న మనం మాసిన అమ్మాయి ఇలా లేదే' అని ఎవరికివాగే అనుకున్నారు. కాని ఆ గదిలో నుండి బయటకు రాలేదు వాళ్ళు. వాసవి అలాగే బయట నిలుచుంది రోడ్డువైపు చూస్తూ.

బస్సులో తను నళిని లాల్‌బజార్ స్టాపులో దిగారు. అక్కడ నుంచి కాస్త దూరంలో వున్న అజయ్ ముందు వాసవిని స్కూటర్‌లో ఇంటిదగ్గర దింపి మరల నళిని కొరకు వెళ్ళాడు.

విశాలమైన వరండాకి రెండు ద్వారాలకి రెండు దారులున్నట్లు మెట్లు వున్నాయి. ఒక ద్వారానికి లైట్‌పింక్ తెర వుంది. మరో ద్వారానికి తెర లేదు. రెండు పొడుగు బెంచీలు వేసివున్నాయి. ఇద్దరాడవాళ్ళు ఒక బెంచీపై, మరో బెంచీపై ఒక ముసలిఅతను కూర్చునివున్నారు. అప్పుడు మాసింది నేమ్ బోర్డ్. అజయ్ అమ్మ, నాన్న ఇద్దరూ డాక్టర్లు. రిటైర్ అయ్యాక ప్రాక్టీసు పెట్టారు అక్కడ. అదో కాలక్షేపం వారికి. ట్రీట్‌మెంట్‌కంటే సలహా కోసం వచ్చేవారు యెక్కువ. ఆ గది కన్‌సల్టింగ్ రూమ్. తెర వున్న గదిలోకి వెళ్ళింది వాసవి. నేలమీద పింక్ రంగు కాయిర్ కార్పెటు పరచివుంది. మధ్యలో సోఫాసెట్టు — టీపాయ్, చిన్న చిన్న పేము స్టూల్స్ వాటిమీద పింక్ క్లాత్ వేసివున్నాయి. గోడల మూలల్లో ఇనుప చట్రాలతో బోగన్‌విల్లా పూల కుండీలున్నాయి. పసుపు, తెలుపు, గోధుమ రంగు, అవి ఆర్టిఫిషియల్ ప్లాస్టికని తలచి దగ్గరకు వెళ్ళి పట్టుకుంది. ముల్లు చురుక్కుమని గిల్లింది. గోడలకి పెట్టిలున్న ఫొటోలున్నాయి కిటికీప్రక్క సినిమాతారల కాలెండర్లు. టీపాయ్ మీద అందంగావున్న విస్కీ సీసాలో రెడ్ ఇక్‌సోనియా లేత బ్లూ ప్లెయ్‌బ్యాగ్ పూల క్రింద వ్రేలాడుతూ సౌందర్య క్రోటన్ ఆకులున్నాయి. ఆ ప్రక్కనే పుస్తకాల స్టాండులో దినపత్రికలు, యెన్నో ఇంగ్లీషు మాగజైను లున్నాయి. ఆ గది సింపిల్‌గ శుభ్రంగా, యెక్కువ సామాను లేకుండా, శుభ్ర చేసుకోటానికి తేలిగ్గా వీలుగా వుంది.

ప్రేమపక్షులు యింకా రాలేదు. బిడియంగ చిన్న సోఫాలో తలుపుకు యెదురుగా కూర్చుంది వాసవి అంతలో స్కూటర్ శబ్దం వినవచ్చింది. తేలిగ్గా నిట్టూర్చింది.

మరో అమ్మాయిని యెక్కించుకురావటం చూసి డాక్టర్ శంకర్ భార్యను చూసి కన్నులు యెగురవేస్తూ రెండు వేళ్ళు చూపించాడు కర్టన్ తొలగించి చూసి నవ్వుతూ మెల్లిగా వచ్చి వాసవి ప్రక్కలో కూర్చుని ''ఎవ్వరూ లేరా'' అని సైగచేసి అడిగింది నళిని. క్రింద పెదవి విరచింది వాసవి.

స్కూటర్ గారేజిలో వుంచి, ''మమ్మీ'' అని పిలుస్తూ ప్రక్క గదిలోకి వెళ్ళాడు. మమ్మీ పేషంటుతో మాట్లాడుతూ, అజయ్ వైపు చూసింది.

''నళినిని తీసుకురమ్మన్నావుగా'' అన్నాడు ఇంగ్లీషులో.

''ఇద్దర్ని తెచ్చావ్'' అన్నాడు శంకర్.

''ఓ డాడీ'' అంటూ పెద్దగా నవ్వాడు.

''కమాన్ డాడీ'' అన్నాడు.

ఆ ఇద్దరూ లేచి కొడుకువెంట నడిచారు నళిని వాసవీలు వారిని చూసి పైకి లేస్తూ అంజలి ఘటించారు.

లేతపసుపు ఇటుకరంగు బార్డర్ వున్న కంచి కాటన్ చీరలు కట్టారు. వదులుగా అల్లిన జడలో కనకాంబర మాలలు భుజాలమీదుగా వ్రేలాడు తున్నాయి. చేతుల నిండుగా గాజాలు నుదుట ఎర్రని కుంకుమ తిలకం. కళ్ళకి కాటుకరేఖలు. చూడగనే ఆంధ్ర గర్ల్స్ అని కనుక్కువేలా వున్నారు. అజయ్ పరిచయాలుచేసి లోపలికి వెళ్ళాడు. అమ్మాయిల కెదురుగా ఆ వృద్ధ దంపతులు కూర్చుని వారి విషయాలు ఒక్కొక్కటి అడిగి తెలుసుకున్నారు. వారిని ఇబ్బందిపెట్టే ప్రశ్నలు వేయలేదు. డాక్టర్ శంకర్ శుభ్రంగావున్న గోళ్ళవంక చూసుకుంటూ, ''ఈ జంటనగరాలలో ఏమేమి చూశారు ? నౌబత్‌పహాడ్ యెక్కి హైదరాబాద్‌ను చూశారా ? చార్‌మినార్ యెక్కి నాల్గురోడ్లను చూశారా ?'' అన్నాడు.

''గోల్కొండకి వెళ్ళారా ?'' అని అడిగాడు.

''లేదు, వెళ్ళాలని అనుకుంటున్నాం'' అంది వాసవి.

''తప్పక వెళ్ళండి. గోల్‌కొండ రాజుల గోరీలున్నాయి. వాటిమీద పవిత్ర ఖురాన్‌లోని వాక్యాలు చెక్కివున్నాయి.''

అంతలో అజయ్ ట్రేలో కోకోకోలా పెట్టుకొచ్చాడు.

గౌరి పేషంట్లను చూడ్డానికి వెళ్ళిపోయింది. శంకర్ డ్రింక్ తాగుతూనే లోపలి కెళ్ళారు.

వాసవి, నళినీలు స్ట్రాని చప్పరిస్తుకుంటూ మెల్లిగా తాగుతున్నారు. అజయ్ లేచి లోనికెళ్ళినాడు. తండ్రికొడుకులు ఏదో మాట్లాడుకోటం వినిపించింది. అజయ్ బ్యాగ్‌తో వచ్చి ''ఎక్స్‌క్యూజ్‌మీ, ఇప్పుడే వస్తా''నంటూ స్కూటర్ మీద వెళ్ళిపోయాడు.

ఒకరి ముఖాలు ఒకరు చూసుకొని ఖాళీ గ్లాసులు పట్టుకొని లోనికి వెళ్లారు. డైనింగ్ టేబిల్ మీద ట్రేలో వుంచారు. మెల్లిగా వంట గదిలోకి తొంగిచూసింది వాసవి. ''హోల్డుమాన్. ఏదో వంట ప్రయత్నంలో వున్నట్లుంది.'' నళిని చెవిలో చెప్పింది బల్లమీద చిన్న ముక్కాలి పీటమీద కూరగాయలు తరుగుతున్నాడు శంకర్. అతని దగ్గరకు వెళ్లి నిల్చున్నారు అమ్మాయిలు. పచ్చిమిర్చి, ఉల్లిపాయలు, కోతిమీర వేటికవి తరిగిపెట్టాడు. బెండకాయలు కడిగి తుడుస్తున్నారు.

''మీరు వెజిటేరియన్సా? నాన్ వెజిటేరియన్సా ?'' అన్నారు తలతిప్పకుండానే.

''సర్వభక్షకులం'' అంది నళిని.

''సర్వభక్షి కాకి కదూ !'' అన్నారు.



అమ్మాయిలు కిలకిల నవ్వారు.

"మేము చేస్తాం. మీరు వెళ్ళండి" అంది నళిని.

ఆశ్చర్యం నటిస్తూ, "మీకు వంట వచ్చా" అన్నట్టు చూశారు.

ముక్తకంఠంతో "చేసి చూపిస్తాం" అంది నళిని.

దేవునిపై భారంవేసి, బాధ్యత వారికి అప్పగిస్తున్నట్లు కళ్ళతోపాటు చేతులు పైకెత్తాడు. "ఫ్రిజ్‌లో డ్రెస్డ్ చికెన్, ఫిష్, ఎగ్స్ వున్నాయి. వెజిటబుల్స్ వున్నాయి. కిచెన్‌లో మీరున్నారు" అంటూ పాంట్ పైకి జరుపుకుంటూ వెళ్ళిపోయారు.

"పాపం వోల్డు గాల్ చేస్తుందేమో వంట. ఇంత వయస్సులో కూడా ఎంత చలాకీగావుందో చూశావా!" అంది నళిని.

"ఆమె పేషంట్లను చూస్తుంటే, అన్నీ తయారుగా తరిగివుంచితే ఆవిడ వచ్చి తాలింపు వేస్తుందికాబోలు. వృద్ధదంపతులు చూడముచ్చటగా వున్నారు."

"వాసవీ! నాకెందుకో – త్వరగా వృద్ధులమైపోతే బాగుండుననిపిస్తుంది."

"నాకేమో ఈ యవ్వనకాలం త్వరగా దాటిపోతుందేమోననిపిస్తుంది."

"అందుకేనా చదువు ఇంకా సాగదీస్తానంటున్నావ్?"

"నీవు యం. ఏ. చేయవా?" వాసవి గొంతులోని మార్పుకి తలెత్తింది నళిని.

"తప్పదంటావా!"

"బావ మనిద్దరికోసం అప్లై చేశారు."

"మనకి సీటు రాకుంటే బాగుండును. ఈ పెళ్ళికి ముందు ఆటవిడుపుగా, ఈ సంవత్సరం మనకి స్వంతం చేయకూడదూ! ఇలాగే గడిపేస్తాం కదా!" ఆశగా వాసవి వైపు చూసింది. "నీకు ఇష్టంలేకపోతే మానెయ్. నాకు తప్పేలాలేదు."

వాసవి బియ్యం కొలిచి పోసుకుంటూ "ఎన్నివేయాలో?" అంది.

"మనిషికో చిట్టెడు కొలువు" అంది నళిని.

"అజయ్‌కి చిట్టెడు సరిపోతుందా?" వాసవి వైపు నళిని చూసింది.

ఎందుకో నవ్వు వచ్చింది. కారణం లేకపోయినా పకపక నవ్వారు. వంట గదిలోనుంచి వినవస్తున్న అమ్మాయిల నవ్వులు విన్న గౌరి,

"డియర్ డాక్టర్! మన జీవితంలో చాలా మిస్ చేశామనుకుంటా?" అంది కూతురు లేదన్న భావంతో.

ఈజిచైర్‌లో వాలిపోయి, రామాయణం చదువుతూ అర్థంచేసుకోటానికి తంటాలు పడుతున్న శంకర్‌గారు –

"యస్ డియర్" అన్నాడు భార్యతో ఏకీభవిస్తున్నట్టు.

అజయ్ ఒకటి రెండుసార్లు వంట గదిలోకి రావటానికి ప్రయత్నించాడు. ఒకరు అట్లకాడ మరొకరు రొట్టెల కర్ర పట్టుకొని బయటికి తరిమేశారు.

"ఇలాగైనా కార్టూనిస్టుల కోరికలు నెరవేరుద్దాం" అంటూ పగలబడి నవ్వారు.

వారి ధాటికి భయపడి పారిపోయిన అజయ్–

"మమ్మీ! అది నీ వంటగదిలా లేదు. హోంసైన్సు ప్రయోగశాలలా వుంది. అది మరీ దోవకు రావాలంటే నెల పడుతుంది" అన్నాడు.

రామాయణంలో నుంచి తలెత్తకుండానే శంకర్‌గారు శబ్దం చేస్తూ లోనికి శ్వాసించి "వాసనలు కమ్మగానే వస్తున్నాయి" అన్నారు.

"అక్కడ పరచిన పదార్థాలు, తీసిన డబ్బా మూతలు చూస్తుంటే, మీకు ఆరునెలలకు పనికివచ్చే ప్రొవిషన్స్ గోవిందా!" అంటూ అతిహాసితం చేశాడు.

అన్నింటికి మౌనంగానే వుంది గౌరి. లేచి తల్లి కుర్చీ వెనక్కి వెళ్ళి కంఠం చుట్టూ



చేతులు పెనవేసి "మమ్మీ! నళినికి ఏమి ఇస్తావు?" అంటూ చెవిలో గుసగుసలాడాడు.

శంకర్ తలెత్తి ఆ తల్లికొడుకుల పరిష్వంగం చూసి ఆయన కన్నులు చెమ్మగిల్లినవి. తాను డాక్టర్. యెన్నో చూశాడు. చావులు, దీర్ఘమైన రోగాలు, పలు బాధలు చూసిన అతని హృదయం వజ్రమంత గట్టిపడిందనుకున్నాడు. కాని వయస్సుతో ఆ గట్టితనం అరిగిపోయినట్లుంది.

త్రేతాయుగంలో జరిగిన గాథ రామాయణం చదువుతుంటే హృదయం ఆర్ద్రమై కన్నులు సజలమైనాయి. ఈ తల్లికొడుకుల అనుబంధం చూస్తుంటే కౌసల్య గుర్తుకు వస్తుంది. రామునితోపాటు తాను అరణ్యవాసము చేస్తానంటుంది. స్త్రీకి భర్తమీదకన్నా కన్న బిడ్డల మీదే మమకారం యెక్కువనుకుంటాను..." అలా తలుస్తూ కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకున్నాడు.

"మమ్మీ! మమ్మీ!" అంటూ ఆజానుబాహుడైన అజయ్ తల్లి ముందు మురిపాలుపడుతున్నాడు.

"అజయ్! ఇవ్వటానికి ఇక నాదగ్గరేముంది? నా ప్రాణం, నా సర్వస్వమైన నిన్ను నళిని తీసుకుంది. నాదగ్గర మిగిలి ఏముంది?" అంది కొడుకు చేతులు నిమురుతూ. అలా పలుకుతున్న ఆ తల్లి గొంతు బొంగురుపోయింది.

"మమ్మీ...మదర్ ఇన్‌లాగా మాట్లాడుతుంది కదా వాడి" అన్నాడు.

ఆ సమయంలో తలుపు అవతలనుంచి "భోజనం తయార్, రావచ్చు" అని అంటున్న వాసవి గొంతు వినిపించింది. ఆ గృహస్థులు అతిథుల్లా లేచారు.

శంకర్‌గారు ఒక్కొక్కటి వడ్డించుకుంటూ, పదార్థాల రుచిని అనుభవిస్తూ, ఆనందంగా భుజించసాగారు.

గౌరి తాను వడ్డించుకుంటూ గరిటకు తగిలిన కోడిగుడ్డు గుత్తిని తీసి అజయ్ సాసర్‌లో వేసింది. అది శంకర్‌గారు చూసి, నొసలు ఎగురవేస్తూ, "పంక్తిలో అంతమంది వుండగా స్పెషల్ పీసెస్ అన్నీ కొడుకు ప్లేట్లో వేసింది. స్త్రీ ఎంత మంచిదైనా తన సంతానం దగ్గర మాత్రం స్వార్థం చూపిస్తుంది. పక్షపాతం వహిస్తుంది. ఆ స్వార్థం ఎంతవరకు పోతుందంటే భర్తను కూడ వదులుకుంటుందికదూ!" అన్నారు.

"పిల్లలకొరకు ఏమైనా చేస్తుందేమోకాని భర్తను వదులుకోలేదనుకుంటాను" అని నళిని అందుకొంది.

ఏ వాదనకైనా ముందంజవేస్తుంది నళిని. ఇక్కడా వూరుకోలేదు. వాసవి, అనుకుంటూ "కాస్త నోరు కట్టుకుంటే మంచిది" అన్నట్టుగా చూసింది.

"వదులుకోదూ? కైకేయి ఏమి చేసింది? కొడుకు పట్టాభిషేకం కొరకు, భర్త ప్రాణాలనే తీసుకుంది."

ఇప్పుడేమంటావ్ అన్నట్టుగా చూశాడు.

"రామాయణంలో మీకెవ్వరు యిష్టం" అని మళ్ళీ ప్రశ్నించాడు. ఒక ప్రశ్నకి జవాబు రాకముందే మరో ప్రశ్న వేయటం ఆయనకి రివాజు.

"ఎవ్వరికైనా రాముడే యిష్టం" అని గౌరి అంది.

"నాకూ..." అని ఆపిన నళిని వైపు వాసవి తప్ప ఆ ముగ్గురూ చూశారు.

నళిని కూర వడ్డించుకుంటూ 'కైక ఇష్టం' అంది. వాసవి సన్నగా నవ్వింది.

"వ్వాట్?" అంటూ అదిరిపడ్డట్టు అడిగారు శంకర్. చేతిలో ముద్ద విరిగి, మెతుకులు పైన కూడ పడ్డాయి.

"డాడీ మమ్మీ అంత ఆశ్చర్యపోతుంటే, ఈ కైక ఎవ్వరు?" అని ఇంగ్లీషులో అడిగాడు అజయ్.

"అజయ్‌కి రామాయణం అంటే రాముడి భార్యను జయంట్ అంటే రావణాసురుడు కిడ్‌నాప్ చేసుకుపోయాడు" అని మాత్రం తెలుసు.

"అజయ్ ఎంతో నయంకదా! వాసవీ! రామాయణం అంతా విని రాముడికి సీత ఏమి కావాలని అడగలేదు." ఆ విట్‌కి అందరూ నవ్వారు

[ఇంకా వుంది]

# సినిమా విశేషాలు -జి. వి. జి.

### కెప్టెన్ కృష్ణలో తలాతోకా లేని టెలిగ్రాం

ఖాన్ (మోహన్‌బాబు) ఓ టెలిగ్రామ్ ఫామ్ నింపి, సంతకం చేసి, పదిరూపాయలిచ్చాడు. కౌంటర్‌లో వున్న ఒక ముసలాయన అది చదివి, అర్థంకాక, బుర్ర గోక్కున్నాడు. "ఎవరయ్యా నువ్వు? ఏ ఊరు మంది?"

"ఏం? పిల్లనిస్తావా?"

"నువ్విస్తే కట్టుకుందికి నేను రెడీగానీ, ఏమిటీ పిచ్చి టెలిగ్రామ్? నాకేం బోధపడలే!"

"అది నీ కనవసరం. మాటలు తెలీకపోతే చెప్పు. 'అవర్ వెడ్డింగ్ ఎట్ సారచేపగూడెం టుమారో. ప్లీస్ కమ్ గెట్ హండ్రెడ్ అంకుల్స్'... సరేనా?"

"ఇంగిలీషు మాత్రం తెలుసయ్యా. సారచేప గూడెంలో రేపు మన పెళ్ళి. వందమంది మామల్ని తీసుకురా – అంటే, తలాతోకా వుందటయ్యా? వున్నా, వందమంది మామలంటే నీకు నూరు పెళ్ళిళ్ళా? నీకు పిచ్చయినా వుండాలి. నువ్వు తాగన్నా వుండాలి."

"రెండూ లేవు. దీని అర్థం నీ కనవసరం. ఇటు చూడు," అంటూ వందరూపాయలనోటును అతనికిచ్చాడు ఖాన్. అది తీసుకొని, "చిల్లరొద్దా?" అన్నాడు ముసలాయన. "వద్దు," అని ఖాన్ అనేసరికి "మహాప్రభో! బ్రహ్మాండంగా అర్థమైంది. తక్షణం కొట్టేస్తా. అయినా – టెలిగ్రామ్‌వాడికి మాటలు, రేటులే తప్ప – అర్థాల గొడవెందుకు? నిజమే," అన్నాడు ముసలాయన. "గుడ్!" అంటూ వెళ్ళిపోయాడు ఖాన్.

కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో డి. రాజశేఖరరెడ్డి నిర్మించిన శక్తి సినీ ఎంటర్‌ప్రైసెస్ "కెప్టెన్ కృష్ణ"లో కృష్ణ హీరో. ఆగస్టు 24 న విడుదలయ్యే ఈ వన్నెల చిత్రానికి నిర్వహణ: అలపాటి రాధాకృష్ణారావు.

### కృష్ణ, శ్రీదేవి నాయికా నాయికలుగా

బి. వి. ప్రసాద్ దర్శకత్వంలో నటుడు, కథకుడు బాలయ్య సమర్పించే అమృతా ఫిలిమ్స్ వర్ణ చిత్రంలో, కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో కుదరవల్లి సీతారామస్వామి నిర్మించే వర్ణ చిత్రంలో, కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో పి. బాబ్జి, జి. సాంబశివరావులు నిర్మించే త్రిమూర్తి ప్రొడక్షన్స్ 6వ చిత్రంలో, జి. సి. శేఖర్ దర్శకత్వంలో ఆడుసుమల్లి లక్ష్మీకుమార్ నిర్మించే మారుతీ ప్రొడక్షన్స్ వర్ణ చిత్రంలో కృష్ణ, శ్రీదేవి నటిస్తున్నారు. ఈ జంట శ్రీ ఉదయ్ ఆర్ట్ పిక్చర్స్ "సమాజానికి సవాల్", తిరుపతి ఇంటర్నేషనల్ వారి "బుర్రిపాలెం బుల్లోడు" వర్ణ చిత్రాలలో నటిస్తున్న విషయం పాఠకులకు విదితమే.



'రారాకృష్ణయ్య'లో



చంద్రమోహన్, మాధవి

## నూతన్‌ప్రసాద్ రికార్డులు, గ్రామఫోన్ రికార్డులు

వరప్రసాదరావు నూతన్‌ప్రసాద్ అయ్యాక బాగా బిజీ అయిపోయారు. "చలిచీమలు" చిత్రంతో ఈ ఉచ్ఛదశ ప్రారంభమైంది. ఆ చిత్రంలో ఈయన తొమ్మిదిన్నర నిమిషాల ట్రంక్‌కాల్ సంభాషణ ఒకే టేక్‌లో తీయబడింది. ఆ సంభాషణ గ్రామఫోన్ రికార్డ్‌గానూ విడుదలైంది. "ఇంటింటి రామాయణం"లో ఈయన పాల్గొన్న ఎనిమిదిన్నర నిమిషాల హరికథ, "కలియుగ మహాభారతం"లోని కొన్ని సంభాషణలు కూడా ధ్వనిముద్రికలుగా విడుదలయ్యాయి. "కుడి ఎడమైతే" చిత్రంలో 450 అడుగుల – దాదాపు అయిదు నిమిషాల సీన్ ఒకటుంది. "షోకిల్లారాయుడు"లో అంతకన్నా పెద్ద షాట్‌ను ఈయనతో చిత్రీకరించాలన్న తలంపు డైరెక్టర్ ఎస్. డి. లాల్‌కు కలిగింది. మూడు రోజుల డిస్కషన్ తర్వాత దాసం గోపాలకృష్ణ ఎనిమిది పేజీల డైలాగ్‌ను రాసుకొచ్చారు. "అది 780 అడుగుల షాట్. ముందు లైటింగ్ వగైరాలు ఏర్పాట్లు చేయడానికే రెండున్నర గంటలు పట్టింది. ఆ ఏడున్నర నిమిషాల డైలాగ్‌ను ఏకబిగిన ఒకే షాట్‌లో ఎంతో సునాయాసంగా చెప్పారు నూతన్‌ప్రసాద్. ఫ్రేమ్‌లో ఉన్న మిగతా పాత్రధారులను చూస్తూ, మధ్య మధ్య కెమెరా వైపు తిరిగి క్లోజప్‌లిస్తూ ఆయన అద్భుతంగా నటించగానే, ఈ అపూర్వమైన షాట్‌ను చూడడానికి సెట్‌లోకి వచ్చి రాత్రి తొమ్మిది గంటలవరకు చకితులై చూస్తూ నిలుచోనున్న సత్యా స్టూడియోలోని టెక్నీషియన్‌లు, ఇతర సిబ్బంది హర్షధ్వానాలు చేశారు. కొంతమంది ఈలలు వేస్తూ, పూలవర్షం కురిపించారు. ప్రపంచంలో ఏ నటుడూ సృష్టించని రికార్డ్‌ను నూతన్‌ప్రసాద్ స్థాపించారు. ఇంతవరకు ఏ దర్శకుడూ పొందని క్రెడిట్‌ను ఆ నటుడు నాకు అందించాడు. నా ఇరవై రెండేళ్ళ సినిమా అనుభవంలో ఏనాడూ ఇంతటి అనుభూతిని నేను పొందలేదు," అన్నారు జాన్‌ఫాక్ ఫిలిమ్స్ "షోకిల్లారాయుడు" చిత్రానికి దర్శకత్వం నెఱపే ఎస్. డి. లాల్. "ఇంత లెంగ్తీ డైలాగ్‌ను నేనెప్పుడూ చిత్రీకరించలేదు. ఇంత థ్రిల్ ఎప్పుడూ పొందలేదు. నా కిదొక మరపురాని అనుభవం. ఆ రోజు రాత్రి నాకు, మా అన్నకు అసలు నిద్రే పట్టలేదు," అన్నారు ఛాయాగ్రహణ దర్శకుడు ఎస్. ఎస్. లాల్.

"నాకు ఫాన్ గాలి చాలదు. రాత్రిళ్ళు ఆరుబయటనో, డాబామీదో పడుకుంటేగాని, కునుకుపట్టదు. ఆ షాట్ తీసిన రోజంతా నిప్పులు చెరిగే ఎండ. ఫ్లోర్‌లో ఒకటే ఉక్క పోస్తోంది. కాని, ఆ షాట్‌లో పాల్గొన్నప్పుడు మాత్రం నాకు స్వేద పట్టలేదంటే నమ్ముతారా? నా బాడీ సిస్టమ్ అంతా స్తంభించిపోయినట్లుయింది నా కాన్సన్‌ట్రేషన్‌వల్ల," అన్నారు నూతన్ ప్రసాద్. ఆయన అంతకు ముందురోజు ఉదయం ఒక షూటింగ్, మధ్యాహ్నం ఇంకో చిత్రం డబ్బింగ్‌లో పాల్గొని, ఆ తర్వాత విమానంలో హైదరాబాద్ వెళ్లి, రాత్రంతా అక్కడో షూటింగ్ ముగించుకొని, ఉదయమే విమానంలో మద్రాసుకు తిరిగివచ్చారట.

ఈయన హీరోగా నటించిన "ప్రెసిడెంట్ పేరమ్మ", విలన్‌గా నటించిన "విజయ" చిత్రాలు దాదాపు ఒకే సమయంలో విడుదలయ్యాయి. ఈ రెండూ శతదినోత్సవ చిత్రాలు. అలాగే ఇప్పుడు విలన్‌గా నటించిన "చెయ్యెత్తి జైకొట్టు", హీరోగా నటించిన "కుడి ఎడమైతే" చిత్రాలు కూడా ఇంచుమించు ఒకే సమయంలోనే విడుదలవుతున్నాయి. "నా ఇల్లు – నావాళ్ళు" చిత్రంలో కమీడియన్‌గానూ నటించారు. ఇలా స్వల్ప వ్యవధిలోనే వివిధ పాత్రలలో ఒప్పించే ఇంతటి ఘనత దక్కించుకున్న ఏ నటుడైనా చిత్ర పరిశ్రమలో పది కాలాలపాటు వర్ధిల్లుతారనడంలో అత్యుక్తి ఏమీ లేదు.

## రాజాశివానంద్ దర్శకుడుగా

లోగడ పలు చిత్రాలకు కథకుడుగా, సంభాషణలకర్తగా, సహకార దర్శకుడుగా పని చేసిన రాజాశివానంద్ తొలిసారిగా రోజ్ ప్రొడక్షన్స్ వారి చిత్రానికి దర్శకత్వం నెఱప బోతున్నారు. చిత్రం పేరు "సూర్యోదయం". "కొత్త నటవర్గంతో నెల్లూరు ప్రాంతంలో షూటింగ్ జరుగుతుంది," అని తెలియజేశారు నిర్మాత ఎస్. కె. బాషా. రోహిణీచంద్ర సంగీతం, రాజు నృత్య దర్శకత్వం, అంకిరెడ్డి కూర్పు వగైరా సాంకేతికవర్గం. నిర్వహణ: ఖలీలుద్దీన్. "వెర్రితలలువేస్తున్న నాగరికత మోజులో మనం కోల్పోతున్న సాంప్రదాయాల్ని, సంస్కృతిని ఒక్కసారి మనకు గుర్తుచేసి, కర్తవ్యాన్ని ప్రబోధించే చిత్రం ఇది," అన్నారు రాజాశివానంద్.

# సినిమా

## ద్విపాత్రధారులు

దాసరి నారాయణరావు రచన, దర్శకత్వంలో కోనై చెషియస్ నిర్మించే "సర్కస్‌రాముడు" రంగుల చిత్రంలో ఎన్. టి. ఆర్. ద్విపాత్రధారి. ఆయన సరసన జయప్రద, జయసుధ నాయికలు. కె. సి. ఫిలిమ్స్ ఇంటర్నేషనల్ పతాకంలో తయారయ్యే చిత్రమిది.

ఎం. ఎస్. గోపీనాథ్ దర్శకత్వంలో "రాముడు – పరశురాముడు"గా శోభన్ బాబు నటించే సురేష్ ఫైన్ ఆర్ట్స్ వర్ణ చిత్రంలో లత, గీత నాయికలు.

కృష్ణంరాజు ద్విపాత్రలు నిర్వహించే నవజ్యోతి ఫిలిమ్స్ "కల్యాణ చక్రవర్తి" చిత్రం పది రీళ్ళకు పైగా పూర్తయింది. కోటారెడ్డి దర్శకత్వంలో, ఎస్. సాంబశివరావు నిర్వహణలో పి. నాగేశ్వరరావు ఈ వన్నెల చిత్రాన్ని తయారు చేస్తున్నారు.

## ఏనుగు నృత్యం

"ఏనుగు మద్యం సేవించి క్లబ్‌లో నాట్యం చేయడం, హార్స్ ఛేసింగ్స్ వగైరాలు చాలా శ్రమతో చిత్రీకరించాం," అన్నారు దేవర్ ఫిలిమ్స్ "అమ్మ ఎవరికైనా అమ్మ" వర్ణ చిత్ర నిర్మాత దండాయుధపాణి. ఆర్. త్యాగరాజన్ దర్శకుడు.



'ముత్తయిదువ'లో జయచిత్ర

## "ముద్దు - ముచ్చట"లో ముప్పుతిప్పలు

ప్రెసిడెంట్ (ఎం. రంగారావు) హతమార్చబడ్డాడు. "రాజారావ్! ఈ హత్యకు — నీకు ఎలాంటి సంబంధమూ లేదు. నేనే చంపాను. వెళ్లండి మీరు లోపలికెళ్లండి," అన్నాడు నారాయణరావు (శ్రీధర్). "ఏమిటండీ ఈ అఘాయిత్యం?" అని లక్ష్మి (శారద), "అన్నయ్యా, ఏమిటిదంతా?" అని గోపీ (మురళీమోహన్) ఒక్కసారిగా అడిగారు.

"చంపేశాను ఇంతకాలం ఈ ఇంట్లో జరుగుతున్న అనర్థాలన్నింటికీ కారణం వీడు. ఈ కుటుంబం నవ్వులపాలు కావడానికి కారకుడు ఈ దౌర్భాగ్యుడు. అమాయకుడైన రాజారావును ఆకట్టుకుని ఈ వచ్చటి కాపురంలో చిచ్చురేపాడు. అందుకే ఈ దుర్మార్గుడ్ని కసితీరా చంపాను."

"నమ్మను. కోపమంటే ఏమిటో ఎరగని మీరు, చుక్క రక్తం కనిపిస్తేనే కరిగిపోయే మీరు, పక్కమనిషి బాధపడితేనే కదిలిపోయే మీరు — ఈ హత్య చేశారా? లేదు. ఎవర్నో కాపాడ్డం కోసం, ఏదో దాచడంకోసం — చేయని నేరాన్ని మీమీద వేసుకుంటున్నారు. మాకు అన్యాయం చేస్తున్నారు. మిమ్మల్నే నమ్ముకున్న నన్ను — నా బిడ్డను ఏం చేయదలచుకున్నారు? నిజం చెప్పండి. ఈ హత్య ఎవరు చేశారో చెప్పండి. ఈ పసిబిడ్డమీద ప్రమాణం చేసి చెప్పండి," అని లక్ష్మి బావురుమంది.

"అబద్ధం! ఈ హత్య నువ్వు చెయ్యలేదు. ఇంత త్యాగానికి నేనర్హుడ్ని కాదు, బావా! దేవతల్లాంటి మీ అందర్నీ చూస్తూంటే, నామీద నాకే అసహ్యమేస్తోంది. ఇన్నాళ్ళూ నే చేసిన పాపాలన్నింటినీ — కనీసం ఈ ఒక్క నిజం చెప్పైనా తుడిచేసుకోనివ్వండి. నేనీ హత్య చేయడం కళ్ళారా చూసిన సాక్షి ఉంది. జానకీ, చెప్పు. జరిగింది చెప్పు," అన్నాడు రాజారావు (గిరిబాబు).

"వదినా! ఆయన చెప్పింది నిజం," అంది జానకి (కవిత).

ఆగస్టులో విడుదలయ్యే మాధవీ చిత్రవారి "ముద్దు ముచ్చట" చిత్రానికి నటుడు గిరిబాబు కథ, జంధ్యాల మాటలు రాశారు. చక్రవర్తి సంగీత దర్శకుడు. కె. వాసు దర్శకత్వంలో వై. శ్రీదేవి నిర్మించారు.

### ధర్మయుద్ధం

రజనీకాంత్, శ్రీదేవి, లక్ష్మిశ్రీ, రాజ్‌బాబు నటించిన "ధర్మయుద్ధం" వన్నెల చిత్రాన్ని ఆగస్టులో విడుదల చేయదలచినట్లు తెలిపారు నిర్మాత పొత్తూరు మధుసూదనరావు రాజశ్రీ రచన, బాలకృష్ణ ఛాయ, ఇళయరాజా సంగీతం ఇతర ఆకర్షణలు. నిర్వహణ: ప్రసాద్.

'కెప్టెన్ కృష్ణ'లో కృష్ణ





'తూర్పు వెళ్ళే రైలు'లో జ్యోతి

**మంగళతోరణాలు**

సుభద్ర (తాళ్ళూరి రామేశ్వరి) కాలుకి ...రిచేసుకుంటూవుండగా రుక్మిణి (పి. ఆర్. వరలక్ష్మి), సత్య (పల్లవి) వచ్చారు.

రుక్మిణి : ఏమమ్మా, మీ చిన్నన్నయ్యగారు ... పెళ్ళి మన సుకుమార్‌తో ఖాయపరిచారు.

సత్య : రేపు 22 వ తేదీన పెండ్లి.

రుక్మిణి : ఏ ఏ చీరలు కొనమంటావ్, ఏమేం నగలు చేయించమంటావో చెప్పు. అన్నీ పూరమాయిస్తాం.

సత్య : ఏమిటలా చూస్తావ్ ? ఈ పెళ్ళి ...కు ఇష్టంలేదా ?

రుక్మిణి : ఇష్టం వున్నా లేకపోయినా అప్పుడు. మా చిన్నన్నయ్య ఏర్పాట్లన్నీ చేసేశారు.

సుభద్ర : [ కృష్ణయ్య రావడం చూసి ] నా చిన్నన్నయ్య ఏం చేసినా నా మంచికోసమే చేస్తాడు. ఎప్పుడూ నా క్షేమాన్నే కోరతాడు. నాకు తెలుసు.

కృష్ణయ్య : అమ్మ దొంగా ! కనిపెట్టేశావన్న మాట ?

సుభద్ర : అన్నయ్యా !

కృష్ణయ్య : పిచ్చితల్లీ !

రుక్మిణి : మనం బోల్తాపడ్డాంగాని, ఈవిడ పడలేదు.

**సినిమా**

సత్య : ఎందుకు ఏడుస్తుంది ... అన్నది తన్న చెల్లెలు.

కె. కె. ... రెడ్డి ... దర్శకత్వ శాఖలో అనుభవం పొందిన ... డైరెక్టర్ సంగీతం శ్రీనివాస రావుకు ... దర్శకత్వం

వహించే అవకాశం రాలేదుగాని, ఆయన వాంఛ మరో రూపంలో కృష్ణషా వారి "మంగళ తోరణాలు"లో తీరింది. చిత్తూరు సమీపంలోని బంగారుపాళ్యం గ్రామంలో చిత్రీకరించిన పై సన్నివేశానికి ప్రేరణ "సుభద్రా కల్యాణం". అర్జునరావుగా అర్జునుడువంటి పాత్రలో చంద్రమోహన్, కృష్ణయ్యగా సత్యనారాయణ, నారదుడులాంటి నారదముని పాత్రలో సంగీతం మేష్టారుగా నూతన్‌ప్రసాద్, ఇలాగే బలరాముడు, గయుడు, రేవతి, లక్ష్మణకుమారుని పోలిన పాత్రలలో జగ్గయ్య, నాగభూషణం, శ్యామల, విజయ్ (జయప్రద సోదరుడు) నటిస్తున్నారు. పలమనేరు, నల్లంగాడు, కౌండిన్య నది, తామర చెరువు వద్ద కొన్ని ప్రధాన సన్నివేశాలు చిత్రీకరించారు. ఆగస్టు 15 కు షూటింగ్ పూర్తవుతుందని నిర్మాణ నేతృత్వం వహించే పి. వి. రమణయ్య తెలియజేశారు. కృష్ణ, షా నిర్మాతలు. కథ, మాటలు దాసం గోపాలకృష్ణ రాశారు. రమేష్‌నాయుడు సంగీతం, శ్రీకాంత్ ఛాయ, కోటగిరి గోపాలరావు కూర్పు, తోట శిల్పం, కె. వి. కృష్ణయ్య సహకార దర్శకత్వం, పారిక రామచంద్రరావు నిర్వహణ, చంద్రమౌళి నిర్మాణ పర్యవేక్షణ తెర వెనుక హంగులు.

"నేను ఎన్ని హిందీ చిత్రాలలో నటిస్తున్నా, నా మాతృభాషను, మన రాష్ట్రాన్ని మరచిపోగలనా? ఇకముందైన ఏటా ఒక తెలుగు చిత్రంలో నటిస్తాను," అంది తాళ్ళూరి రామేశ్వరి, ప్రాతికేయులతో.

**ప్రముఖ రచయిత నిర్మించే చిత్రం**

స్వర్గీయ ఆర్నాల్డ్ బెన్నెట్ 1930 లో రచించిన "ఇంపీరియల్ పాలెస్" నవలను మేక్మిలన్ పబ్లిషింగ్ కంపెనీవారు తెరకెక్కించబోతున్నారు ఈ సంస్థ నిర్మించే తొలి చిత్రమిదే.

[ 28వ పేజీ చూడండి ]



'ముద్దు-ముచ్చట'లో శ్రీధర్, శారద



'మన్ పసంద్'లో గిరీష్, టీనా, దేవ్

# "కళాకారునిగా జీవించడానికే కమ్మర్షియల్ చిత్రాలు" — గిరీష్ కర్నాడ్

కన్నడ హిందీ చిత్రాలలో కళాకారునిగా, దర్శకునిగా ఎన్నో అవార్డులని అందుకున్న గిరీష్ కర్నాడ్ తన దృష్టిని కళాఖండాలపైనించి కమ్మర్షియల్ చిత్రాలవైపు మళ్లించడం ఎంతోమందికి ఆశ్చర్యాన్ని కల్గించింది.

''దురీయా'' చిత్రం సెన్సార్ పూర్తయిన సందర్భంగా నిర్మాత—దర్శకుడు భీమ్‌సేన్ ఏర్పాటుచేసిన 'గెట్ టుగెదర్'కి గిరీష్ చాలా సీదాసాదాగా వచ్చారు

## అవార్డులు అన్నం పెట్టవు

కమ్మర్షియల్ చిత్రాలని నిర్మించే దేవానంద్ యిప్పుడు కళాత్మక చిత్రాలపై మోజుపడుతూ ఉంటే, కర్నాడ్ దృష్టి కళాత్మక చిత్రాల నుంచి కమ్మర్షియల్ చిత్రాలపైకి మారడానికి కారణం తెలుసుకోవాలనిపించింది.

''గిరీష్‌సాబ్ ! మీరు ఆర్ట్ ఫిల్మ్స్ వదలిపెట్టి కమ్మర్షియల్ చిత్రాలవైపు వచ్చారేమిటి ?'' అనడిగాను

నా ప్రశ్నకి గిరీష్ నవ్వారు.

''నేనూ మనిషినే కదా! మనిషి తర్వాతే కళాకారుడు మనిషి బ్రతికి ఉంటేనే కళాకారుడు జీవిస్తాడు. తిండి, బట్టకోసం ఏదైనా చెయ్యాలి గదా. ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో ఉద్యోగం మానేశాను కళాసేవ చెయ్యాలన్నా నాలుగు డబ్బులు సంపాదించాలి. కన్నడ, హిందీ భాషల్లో మంచి చిత్రాలు నిర్మించాను. ఒక్క 'స్వామి' చిత్రం మినహా మిగతావన్నీ అవార్డులని తెచ్చిపెట్టాయి. కానీ ఆర్థికంగా ఆశించినంత ఫలితం అందలేదు. ఇలా నేను పూర్తిగా అవార్డు చిత్రాలే తియ్యాలంటే ఉదయం నుంచి సాయంకాలందాకా ఎక్కడన్నా ఉద్యోగం చేస్తూ మిగతా సమయంలో చిత్రాలు తియ్యాల్సి ఉంటుంది కన్నడ చిత్రాల్లో చిత్రానికి నాలుగైదువేల రూపాయల పైన రావు. ఈ పరిస్థితి మెరుగుపడాలనే నేను వ్యాపార దృష్టికి వచ్చాను అలాగని ఆర్ట్ ఫిలింస్‌ని వదిలిపెట్టను. వాటికీ నాకూ అవినాభావ సంబంధం ఉంది'' అని చెప్పారు.

## దర్శకునిదే పైచెయ్యి

కమ్మర్షియల్ చిత్రాలలో కళాకారునిగా పనిచేస్తూ—ఒక మంచి దర్శకుడై ఉండికూడా—ఆ చిత్ర దర్శకునితో ఎలా ఎడ్జస్ట్ కాగలరని కర్నాడ్‌ని అడిగినప్పుడు :

''ఒక దర్శకుని దగ్గర పనిచేస్తున్నప్పుడు ఆయన చెప్పినట్లు నడుచుకోవాలి. చెయ్యమన్నట్లు చేయాలి దర్శకుని ఆజ్ఞ పాటించడం నా విధిగా భావిస్తాను నన్ను ఎవరైనా సలహా అడిగితే తోచింది చెప్తాను'' అన్నారు గిరీష్.

— మాస్టర్ రచ్చ భూమేశ్వర్

సమతామూవీస్

# జూదగాడు

ఈస్ట్‌మన్‌కలర్





ర ప్రయి త్రి  ధా య మ త

'అమ్మ ఎవరికైనా అమ్మ'లో శ్రీప్రియ, అంజలీదేవి



## గోరింటాకులో ప్రసవవేదన

## సినిమా

వార్డులో బెడ్ మీద ఒకామె కనలేక బాధపడుతూంటే, ఆ కాన్పు చేయలేక గుమ్మంలో తారట్లాడుతూ సర్జన్ స్వప్న బాధపడుతోంది. అటుగా వెళ్తున్న కొలీగ్ విజయను ఆపి, "ఏమిటే హడావుడి ?" అంది స్వప్న

"ఉండవే, బాబూ! అర్జెంట్‌గా నాకు డెలివరీ వచ్చింది," అంది విజయ

"ఇది నీ కెన్నో డెలివరీ ?"

"మూడు."

"మూడుకే ఇంత హైరానపడిపోతున్నావ్. నేను ఆరు చేశాను తెలుసా ?"

"చేస్తావే, బాబూ! నీ ఓపిక నాకెక్కడిది?" అంటూ విజయ వెళ్లిపోయింది.

వాళ్ళ సంభాషణ వింటూ నిల్చున్న రాము, స్వప్న దగ్గరగా వచ్చాడు. "ఏమిటీ, మీ డెలివరీ ఇంకా అవలేదా ?" అన్నాడు అంతలో లోపల్నుండి "అమ్మా!" అంటూ మూలుగు వినిపించింది "అదుగోండి — వచ్చేసింది," అన్నాడు రాము

"ఆ. ప్రొద్దుటనుంచి 'ఆ, ఊ' అంటుంది తప్ప — కనదు. నాకేమో తలనొప్పిగా వుంది ... ఏవండీ, నాకో చిన్న హెల్ప్ చేసిపెడతారా ?"

"మీ డెలివరీ నన్ను చెయ్యమంటారా ?"

"అవునండీ."

"మరి, నా డెలివరీ !"

"మీరు చాలా చేసుకున్నారుగా ? ఈ ఒక్కటీ ఈరోజు చేసేస్తే, మొత్తం నాకు ఏడవుతాయి"

"మీకు ఏడయ్యేలోపల నాకు డెలివరీ వస్తుంది."

"కట్! అందరి డైలాగ్ డెలివరీలు సుపర్బ్," అన్నారు డైరెక్టర్ దాసరి నారాయణరావు నవ్వుతూ. సర్జన్లుగా శోభన్‌బాబు, సుజాత, సరోజ నటించారు. కె. నరసింహంనాయుడు సమర్పించే యువ చిత్ర వారి "గోరింటాకు" వన్నెల చిత్రానికి కె. మురారి నిర్మాత. కె. రామలక్ష్మి కథకు దర్శకుడే స్క్రీన్‌ప్లే, సంభాషణలు సమకూర్చారు. యు. రాజగోపాల్ ఛాయాగ్రాహకుడు. మహదేవన్ సంగీత దర్శకుడు సి. వి. రమణబాబు సహకార దర్శకుడు

## విశేషాలు

### బ్రహ్మయ్య - బనగానపల్లెవాసిగా

తల్లికి విశ్వరూపం ప్రదర్శించిన బాలబ్రహ్మయ్య తీర్థయాత్రలకు బయలుదేరి, బనగానపల్లె చేరుకున్నాడు. అక్కడ గరిమిరెట్టి అచ్చమ్మ ఇంటి అరుగుమీద పడుకున్నాడు. ఉదయం వాకిలి శుభ్రం చేయడానికి వచ్చిన ఆ తల్లి ''ఎవరు నాయనా నువ్వు ?'' అంది.

''అన్నీ నేనే అయిన నేను ఎవరినని చెప్పగలను, తల్లీ !'' అన్నాడు బ్రహ్మయ్య

''మనదే ఊరు, నాయనా ?''

''ఏ ఊరైనా అది నాదేనమ్మా.''

''చోద్యంగా ఉందే! మరి నీకెవరూ లేరా ?''

''లేకేమమ్మా ! ఉన్నవారందరూ నావారే.''

''ఏమిటో, బాబూ! నీ మాటలు నాకే అంతుపట్టడంలేదు. చూట్టానికి అమాయకుడిలా ఉన్నావు. ఎలా బ్రతుకుతావో ఏమో !''

''అమృతంలాంటి నీ మాటలతో కన్నతల్లిని మురిపిస్తున్నావు. నీకభ్యంతరం లేకపోతే ఇక్కడే ఉంటానమ్మా.''

''అలాగే, బాబూ! నా బిడ్డలాంటివాడివి. మన పశువుల్ని చూసుకుంటూ ఇక్కడే ఉండిపో !''

ఆ విధంగా కాలజ్ఞాన తత్వవేత్త బాల బ్రహ్మయ్య తాత్కాలికంగా బనగానపల్లెవాసి అయ్యాడు.

ఎం. ఆర్. కంబైన్స్ ''బ్రహ్మంగారి కథ''లో బ్రహ్మయ్య మోహన్‌కృష్ణ, ఎం. ఎ., అచ్చమ్మగా శ్యామల నటించారు. ''ఆగస్ట్ 30కి షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు రచయిత, దర్శక నిర్మాత కుమార్.

### కొంత విదేశాలలో

### మరో చిత్రం

''సింగపూర్, మలేసియా, హాంకాంగ్, జపాన్‌లలో డిసెంబర్ 1 నుంచి 20 వరకు షూటింగ్ జరుగుతుంది. ఇక్కడ ఆగస్ట్ రెండవ వారంలో షూటింగ్ ప్రారంభిస్తున్నాం,'' అన్నారు రాజేశ్వరీ ఇంటర్నేషనల్ వారి ''రాముడు – పరశురాముడు'' వర్ణ చిత్రానికి దర్శకత్వం వహించే నిర్మాత ఎం. ఎస్. గోపీనాథ్. సత్యం సంగీత దర్శకుడు.

### "దశ తిరిగింది"

మురళీమోహన్ – దీప, చంద్రమోహన్ – జ్యోతి, నూతన్‌ప్రసాద్, పి. ఎల్. నారాయణ, మణిమాల ముఖ్య పాత్రలు ధరించే అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ వారి వర్ణ చిత్రానికి పై పేరు పెట్టారు. కట్టా సుబ్బారావు దర్శకత్వంలో నిర్మాత దగ్గుబాటి భాస్కరరావు ఆగస్ట్ 29న కారంచేడులో ఈ చిత్రనిర్మాణం ప్రారంభిస్తున్నారు.

### తారల కుటుంబాల నుంచి

### కొత్త తారలు

తమిళ నటుడు ఎస్. ఎస్. రాజేంద్రన్ కొడుకు రాజేంద్రకుమార్, తమిళ నటి విజయకుమారి కొడుకు రవికుమార్, కమలహాసన్ అన్న చారుహాసన్, మనోరమ పుత్రుడు భూపతి, పండరీబాయి చెల్లెలు కూతురు మైనావతి, జావర్ అన్న కూతురు, అపర్ణ తమ్ముడు చిత్రాలలో నటిస్తున్నారు. 



'బొమ్మల కొలువు'లో చంద్రమోహన్

# రష్యాలో బాలలకు ఎన్నో ప్రత్యేక సదుపాయాలు!



మాస్కోలో ఒక పిల్లల నర్సరీ

**సోవియట్ యూనియన్‌లో పిల్లలకు ప్రత్యేకంగా వారికి కావలసిన వస్తువుల అమ్మకానికి దుకాణాలు వుంటాయి**

పిల్లలకు మాత్రం సినిమాలు చూపించడానికి ప్రత్యేకమైన సినిమా థియేటర్లు వుంటాయి. అలాగే లైబ్రరీలు! ప్రతి రంగంలోను పిల్లలకు వేరే యేర్పాట్లుంటాయి. వాళ్ళకి ఉచిత విద్య, వైద్య సదుపాయాలు ఉన్నాయి.

ఆ దేశంలో బాలలకి ప్రతి సంవత్సరం బాలల సంవత్సరమే!

సోవియట్ యూనియన్‌లో పిల్లల పెంపకం పట్ల తీసుకున్నంత శ్రద్ధ మరే ఇతర దేశాల్లోనూ తీసుకోరేమో! ఆ దేశంలో పిల్లల భావాలకి, అభిప్రాయాలకూ అనుగుణ్యంగా పెద్దలు నడుచుకుంటూ, తల్లిదండ్రులు పిల్లలకు స్వేచ్ఛ ఇస్తారు. పిల్లలు అడిగే ప్రతి ప్రశ్నకు తల్లిదండ్రులు ఓర్మిగా సమాధానాలు చెప్తూ వారి సందేహాలను తీర్చుతుంటారు. తల్లిదండ్రులు పిల్లలకీ, పిల్లలు తల్లిదండ్రులకు ఏమి ఇచ్చినా థాంక్సు తెల్పుకుంటారు.

సోవియట్ ప్రభుత్వం పిల్లల పట్ల శ్రద్ధ వహించి పిల్లల్ని పెంచడంలో తల్లిదండ్రులకి తోడ్పించే సదుపాయాన్ని చూస్తుంటే, అన్ని రంగాలకన్నా పిల్లల సంక్షేమంపట్ల ఆ ప్రభుత్వం శ్రద్ధ చూపుతున్నట్లుగా అనిపిస్తుంది. మైనస్ నలభైదాకా వెళ్ళే టెంపరేచర్‌లో రోజుల పిల్లల దగ్గరనుంచి పెంచటం ఎంత కష్టమైన విషయమో మూడు ఏళ్ళపైన వున్న మేము మా బాబుతో కలిగిన అనుభవాలనిబట్టి తెలుసుకోగలిగాము. మోకాలి లోతు మంచుతో నిండివుంటే, కొన్ని ప్రాంతాల్లో ఏ పంటా పండకపోయినా ఆ దేశంలో పిల్లలకి ప్రత్యేకమైన పళ్ళు, తిండి వస్తువులు ఇతర ప్రాంతాలనుంచి తెప్పించి, ప్రభుత్వం నర్సరీలకి సప్లయి చేస్తుంది. తల్లి పాలు చాలని బిడ్డలకి తల్లి పాలు అధికంగా వున్న తల్లుల దగ్గరనుంచి తీసుకొని సీసాల్లో నింపి సప్లయిచేసే ఏర్పాటు చేసిందా ప్రభుత్వం!

## ఉచితమే ఐనా శ్రద్ధగా...

సోవియట్ ప్రభుత్వంలో వైద్యం ఉచితమే ఐనా అశ్రద్ధలేదు. ఒకసారి అనారోగ్యంగా వున్నట్లు డాక్టరుకి కబురు పంపిస్తే, ఆ రోగి కోలుకునేవరకు డాక్టరు వచ్చి చూసి మందులు ఇచ్చి వెళ్తుంటారు. పిల్లలు ఏమాత్రం అనారోగ్యంగా వున్నా తల్లి ఉద్యోగస్తురాలయితే, ఆమెకి డాక్టరిచ్చిన సర్టిఫికెట్‌మీద ఆ బిడ్డ కోలుకునేవరకు ప్రభుత్వం ఆమెకి శలవు ఇస్తుంది.

ప్రతి ఇంటిముందు పిల్లలు ఆడుకోటానికి మైదానాలు వుంటాయి. శీతాకాలంలో మంచుతో కప్పబడిన ఆ మైదానాలని చదునుచేసి దీపాలు ఏర్పాటుచేసి సాయంకాలం పిల్లలు స్కేటింగ్ చెయ్యటానికి అనువుగా చేస్తారు. వేసవికాలంలో ఆ మైదానాల్లో ఇసుకదిబ్బలు పోసి వారికి ఆడుకొనేందుకు ఏర్పాటు చేస్తారు.

## చవకగా నర్సరీలు

తల్లులు ఉద్యోగస్తులయితే ఐదు నెలల వయస్సు గల పిల్లలను కూడా పెంచడానికి నర్సరీలు వుంటాయి. నెలకి పది రూబుల్సు మాత్రమే కట్టాలి. వేసవి శలవుల్లో పిల్లలకి అన్ని సదుపాయాలు వున్న ప్రత్యేకమైన విశ్రాంతి మందిరాలు వూరిబయట ఏర్పాటు చేస్తుంది ప్రభుత్వం! నర్సరీలలో వుండే పిల్లల దగ్గరనుంచి స్కూళ్ళలో చదివే పిల్లల వరకు విశ్రాంతి మందిరాలు వుంటాయి. వేసవి రాగానే వూరిలోని గాలి కలుషితమని ఆ ప్రత్యేకమైన విశ్రాంతి మందిరాలకు పిల్లలను బస్సుల్లో తీసుకువెళ్తారు. ఆ బస్సులవెంట పిల్లలకు రక్షణగా డాక్టరూ, నర్సులూ, పోలీసులు కూడా వెళ్తారు. బస్సులకి ముందు వెళ్ళే జీపులో ముగ్గురు, నలుగురు పిల్లలు కూర్చుని తమ శకటాలు వస్తున్న సూచనగా బాకాలు వూదుతూ వెళ్తారు. ఆ బాకాల శబ్దం వినగానే బీట్ పోలీసులు ట్రాఫిక్ ఆపుచేసి, వారి బస్సులు వెళ్ళిన తర్వాత తక్కిన బళ్ళు వెళ్ళడానికి అనుమతి ఇస్తారు. తల్లిదండ్రులు ఓ రోజు షికారుగా వెళ్ళి తమ బిడ్డలని చూసిరావచ్చును!

పిల్లలు అల్లరిచేస్తే, తల్లిదండ్రులకు కోపం వచ్చినప్పటికి తుంటిమీద మాత్రమే దెబ్బవేస్తారు గాని మరి ఎక్కడా కొట్టరు. వాళ్ళకి భయం!

— ఇందుకూరి వెంకటమహాలక్ష్మి

[న్యూఢిల్లీ]



# 3 నెలలు వచ్చిన తర్వాత, పాలు మాత్రం యిస్తే చాలదు



## డాక్టర్లు సిఫార్సు చేస్తారు



# ఫారెక్స్®

## మీ పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**డాక్టర్లు ఫారెక్స్ సిఫార్సు చేస్తారు! ఎందువల్ల?**

ఎందుకంటే, ఇది మీ పాపాయి ఘన ఆహారం తీసుకోవడం ప్రారంభించే సమయంలో అతడి అవసరాలను తీర్చే సంపూర్ణ సంతులిత ఆహారం. పాపాయి సున్నితమైన జీర్ణకోశానికి సరిగ్గా తగిన ఆహారం.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం?**

ఫారెక్స్ మెదడు, శరీరం పెరుగుదల కోసం తగినన్ని సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను, శక్తి కోసం కార్బోహైడ్రేట్లను, దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తగినంతగా కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి అందిస్తుంది. అన్నిటి కంటె ముఖ్యంగా, పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ అందజేస్తుంది.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**

ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. లేకపోతే నమలకుండా మింగివెయ్యడం వల్ల కడుపు నొప్పి వచ్చి అతడి పెరుగుదల దెబ్బ తినవచ్చు.

అంతే కాకుండా, 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగానే ఉంటుంది. అందుకే మామూలు ఘన ఆహారాలకు బదులు అతడికి ప్రత్యేకంగా తయారు చేయబడిన—అంటే సులభంగా జీర్ణమయ్యే—పిల్లల ఘన ఆహారం అవసరం.

**'పెద్దలు తినే' ఆహారాన్ని ఎప్పటినుంచి ఇవ్వవచ్చు?**

పాపాయి మొదటి సారిగా తప్పటడుగులు వేసినప్పుడు అతడు పెద్దలు తినే ఆహారాన్ని తీసుకోగలుగుతాడు. కొంచెం ఆలోచించి, మీ పాపాయి తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి ప్రేమగా పెట్టండి.

ఇప్పుడు అదే శ్రేష్ఠమైన ఫారెక్స్ కొత్త 400 గ్రాముల డబ్బాలో వస్తోంది.




## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం



# ఎగువ దిగువ

బాగంటి శంకర్

జాతి ప్రగతి దారిలో పోతోంది. జాతీయ రహదారిలో నైట్ డీలక్సు బస్సు పోతోంది. నా మనస్సు డీలక్సులా పోతోంది! మూడు వందల కిలోమీటర్ల పొడవు చేతులుండాల రాధ ఆలింగనానికి! ఈ దూరం, ఈ ఎడబాటూ రాధకీ – నాకూ షనస్పర్థలతో వచ్చినవి కావు స్త్రీ విద్య మధ్య తరగతి జీవితపు ఎడారుల్లో ఎ. సి. రూముల్ని నిర్మించింది. ఆ చలువ గదుల్లో ఉల్లాసానికి లోటులేదుగాని వాటిల్ని చేరేందుకు మాత్రం రోజూ ఎడారిలో నడవాలి! ఆ ఎడారి నడకే ఈ డీలక్సు ప్రయాణం! ఆమె అక్కడ. నేను యిక్కడ. పుట్టుకతోటే నేను తెచ్చుకున్న కొన్ని బాధ్యతలు. ఆమెకూడా తెచ్చిన కొన్ని కర్తవ్యాలు. ఉద్యోగాలు ఒక ఊర్లో దొరికితే ప్రయాసలు, ప్రయాణాలూ ఉండేవి కావు! కొన్నాళ్ళ ప్రయాణం రొమాన్సుగానే ఉంది కాని యిప్పుడో న్యూసెన్సుగా మారింది. చేసేందు కేమీ లేదు గనక, అనుకోకుండా వచ్చిన రెండు శలవలకీ మరో రెండు కలిపి ఆత్రంగా బస్సులో కూలబడ్డాను.

నాకు రెండు సీటుల ముందు ఓ అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి మెడలో నల్లపూసలు కనిపిస్తున్నాయి. నాలాగే ఆవిడానేమో! పెళ్ళాం కోసం నే వెళ్తొంటే, మొగుడి కోసం ఆమె వెళ్తోంది కాబోలు!

బస్సు బయల్దేరే సమయానికి రిక్షావాడూ, మరో యిద్దరు మనుషులూ కలిపి మోసుకొచ్చేరో ముసలాయనని. డ్రైవరు, కండక్టరు ఆయన రావడానికి వీల్లేదన్నారు, ఆయన వాలకం చూసి భయమేసి! ఆయన కూతురు, (కాబోలు, పోలిక లున్నాయి) మరో మొస్తున్నాయనా, "సీరియస్ కాదు, పట్నం అర్జంటుగా తీసుకెళ్ళాలి, హాస్పిటలులో చేర్పించాలి" అని బతిమాలుకున్నాక, మానవత్వం ఎక్కడో అంతరాత్మని ముల్లుగుచ్చి పొడిస్తే ఒప్పుకున్నారు వాళ్ళిద్దరూ, బస్సులో ఎక్కించేందుకు. ఆయనకు కాళ్ళు పడిపోయాయి గెడ్డం పెరిగిపోయి ఉంది. దగ్గుతూ భయంకరంగా ఉన్నాడతను. వాళ్ళ ముగ్గురూ అతికష్టంమీద కుదేసేరు బస్సులో ఆయనని. ఆయన ప్రక్కనే ఆయన కూతురు కూర్చుంది. రెండు తువ్వాళ్ళు, ఉమ్మేందుకు చిన్న గిన్నె వాళ్ళ ప్రక్కనే ఉన్నాయి. ఆయన దగ్గు నాకు జీవితంమీద విరక్తిని కలిగిస్తోంది. తల తిప్పేసి ముందున్న అమ్మాయిని చూడగానే నా రాధ గుర్తొచ్చింది. రాధ నవ్వు, మా యిద్దరి ఆనందం గుర్తొచ్చి ఒళ్ళు పులకరించింది. ప్రసూతి వైరాగ్యం! శ్మశాన వైరాగ్యం!!

నా పక్కనే ఓ ఉద్యోగస్థుడు కూర్చున్నాడు. తనకా బస్సు అందడం అదృష్టమనీ, బస్సుకోసం లారీలో పది కిలోమీటర్ల దూరంనుంచి తను చేసిన ప్రయాణాన్నీ, అర్జంటుగా తను వెళ్ళాల్సిన పనినీ ఓపెన్ హార్టెడ్‌గా, వాళ్ళింటి మనిషిలా నాకు చెప్పేడతను.

నా వెనకాల సీట్లో ఓ సర్దార్‌జీ కూర్చున్నాడు. అతని మొహంలో కోపం, చిరాకూ ఉన్నాయి. సీటులో నిండుగా ఉన్నాడతను. చేతిలో కడియం, తలకి టర్బను ఉన్నాయి. వెనకాతల సీట్లోంచి చిన్నపిల్ల "బూచి, బూచి" అంటోంది అతణ్ని చూపిస్తూ. "తప్పు... తప్పు..." అని దాని నోరు మూస్తున్నాడు వాళ్ళ నాన్న.

యింకా ఎందరో ఎవరి పనుల కోసం, ఎవరి గమ్యాలకోసం వాళ్ళు! రేపు పొద్దున్నే రాధ ముందు వాలడానికి నేను!

రెండ్రోజులై కురుస్తున్న వర్షం కొంచెం తెరిపినిచ్చింది. అయినా చిన్న చిన్న తుంపర్లు తగ్గలేదు మేఘాలు నిలకడగా ఉండక – నా ఆలోచనల్లా – పరుగులు తీస్తున్నాయి. లైట్లన్నీ ఆర్పేసేడు డ్రైవరు. చీకటిగా, చల్లగా నా ఆతృత వేగంతో బస్సు పోతోంది. బస్సు వేగంతో ఆలోచనలు నాలో మూగుతున్నాయి. కిటికీలన్నీ మూసి నిద్రలోకొరిగేరు యించుమించు అంతా. ఇలాటి సమయాల్లో రాధని గురించి ఆలోచించడమంటే నాకెంతో సరదా. రోజులో ఒంటరిగా, నా పట్టింపు ఎవరికీ లేకుండా చేసుకొని రాధని నాలో నేను చూస్తూనే ఉంటాను. అప్పుడు నా నోట్లో సిగరెట్టు విధిగా ఉంటుంది. ఇప్పుడూ సిగరెట్టు వెలిగించేను. అగ్గిపుల్ల వెలుతురిలో బస్సులోని వాళ్ళంతా ఓసారి లీలగా కనిపించి, నేనార్పేయగానే మాయమయ్యేరు. మరో రెండు అగ్గిపుల్లలు వెంటనే బస్సులో వెలిగేయి. సిగరెట్టు వాసన బస్సంతా నిండింది. తాతగారు నిముషం పాటు గుక్కతిరగని దగ్గు దగ్గేడు. వెనకనుంచి సర్దార్‌జీ నా భుజం తడుతూ "సిగరెట్ మత్ పీవో..." అన్నాడు. ఆ వాక్యం బ్లంట్‌గా ఉంది. ఇంతలో "కండక్టర్ సాబ్..." అని కేకేసాడతను. చాలాసార్లు తిరుగుతూండడంవల్ల కండక్టరు నేనెరిగినవాడే. అయినా సిగ్గేసి సిగరెట్టు నార్పేసేను, కాలికింద వేసి చెప్పుతో మట్టేస్తూ. వెలిగిన మరో రెండు సిగరెట్లూ ఆరేయి. సర్దార్‌జీ వాక్యం మాలో భయాన్ని వెలిగించింది. వెనక్కి తిరిగిచూసేనతన్ని. ముడుచుకుపోయి కూర్చున్నట్లనిపించేడు చీకట్లో. నిర్వీర్యులుగా చిత్రిస్తూ చాలా కథలు సర్దార్‌జీలమీద దేశంలో ఉన్నా, వాళ్ళంటే దేశంలో అంత భయం కూడా ఉంది! ముప్పతిప్పలూపడి బలవంతాన కళ్ళుమూసి నిద్ర పోయేను. సీటు బాగుండడంవల్ల ఆఫీసులో అలసిన ఒళ్ళు స్పృహలేకుండా రెస్టు తీసుకుంది.

తుళ్ళిపడి లేచేను, పెద్ద పెద్ద కేకలమధ్య. తెల్లవారిపోయింది. బస్సాగిపోయి ఉంది. కళ్ళు నులుముకుంటూ బస్సు దిగేను. సగం దూరం వచ్చి, త్రిశంకు స్వర్గంతో ఆగిపోయింది బస్సు.

"నల్లమన్ను రోడ్డుకి రెండు పక్కలా వేస్తే టైర్లు కూరుకుపోతాయని తెలీదేంటి యింజనీర్లకి? అసలీ దేశమే అంత! ఈపాటి కింటికెళ్ళాల్సింది, సంగోరు దూరం వచ్చి ఆగిపోయేం. వెధవల్ని తంతే బుద్ధొస్తుంది." అంటున్నాడో మధ్యవయస్కుడు ఎస్. ఐ తో.

"నామీదరుస్తే నేనేం చేస్తాను? కావలిస్తే కంప్లైంటు రాసుకోండి. ఇంజనీరుక్కాపోతే మినిష్టరుకి రాయండి. సూపర్వైజర్లు పని మనుషుల్ని బెత్తాయించేరు. ట్రాఫిక్కాగిపోయిందని మేం వచ్చేం" అన్నాడు ఎస్. ఐ.

"ఆఁ ఆఁ కంప్లైంటు రాసి వాళ్ళ చుట్టూ మమ్మల్ని తిరగమంటారు! దాంతో ఏమాత్రం పనవుతుందో మాకు తెలుసు."

"నీ యిష్టం వచ్చింది చేసుకోవయ్యా. నీతో వాదం నాకనవసరం." అని, "ఒరేయ్ పరమేశా – యిద్దరిటున్నారు. నువ్వటుపోయి చూడు" అని పోలీసుకి చెప్పేడతను. ఆ పోలీసుతో పాటు అతనూ నడిచేడు.

# పౌష్టిక అనుభవము మరొకటి ఇవ్వజాలదు

ఔను! యమ్మీ యమ్మీ ట్రూ బిస్కట్లు ఆనందంతో అనుభవింపదగినవి. రుచికరంగా కరకరలాడుతూంటాయి, ఎన్నిసార్లైనా అల్లా నోట్లో వేసుకోకుండా వుండలేరు! తేనె, గ్లూకోజ్, పాలపొడి, ఏలక్కాయల ఎసెన్స్, తాజా ఎండు కొబ్బరి మొదలైన సహజ పౌష్టిక పదార్థాలు అతి జాగ్రత్తగా సూత్రీకరింపబడి విస్తృత ప్రయోగ ఫలితంగా ఏర్చి కూర్చిన శ్రేణి.

**హనీ గ్లూకోజ్**

తీయని బలవర్ధకమైన బిస్కట్లు, తగినంత అధిక పాళ్ళలో తేనె, ద్రవరూపంలో గ్లూకోజు చేరియున్నవి. ప్రతీ ప్యాకెట్ 350 క్యాలరీల శక్తిని కలిగిస్తుంది.

**నీస్**

కమ్మని కొబ్బరి బిస్కట్లు - తాజా ఎండు కొబ్బరి పుష్కలంగా వుండటంచేత అసలైన కొబ్బరి రుచినిస్తాయి.

**"యాలక్కాయి" కస్టర్డ్ క్రీమ్**

చప్పరించడానికి స్వాదుష్టమైన క్రీమ్ బిస్కట్లు అసలైన యాలకులతో. ఎంతో ఉత్తమమైన క్రీమ్ బిస్కట్లు.

**మారీ**

కొంచెం తీపితో గరగరలాడుతూ కాఫీ, టీలతో తీసుకోడానికి అనువుగా వుంటాయి. మీ పానీయాలతో పాటు తినడానికి ఆదర్శమైనవి.

**ఇంకా ఎన్నెన్నో**

వీటిలో ప్రతీదీ కూడా విశిష్టకరమైన పొట్లంలో ఉంటుంది. వాస్తవానికి బిస్కట్ల తయారీలలో మేమొక్కరమే సెలోఫేన్ (పొట్లం కట్టడానికి ఖరీదైన కాగితం) ధారాళంగా వుపయోగిస్తాము. నేరుగా బిస్కట్లను చుట్టివుండటంచేత బిస్కట్లు సువాసనతో ఉంటాయి - గరగరలాడు తూంటాయి - ఫ్యాక్టరీనుంచి అప్పుడే వచ్చినట్టు తాజాగా వుంటాయి.

**మీరు మీ కుటుంబం పుష్టికరమైన రకరకాల బిస్కట్లతో విందు చేసుకోండి. వాటి విశిష్టత మీరే గ్రహించండి.**



**ట్రూ బిస్కట్లు**

**TRUE biscuits**




**4 'మాండీ' పతకాల విజేత**




ఇండియాలో అధునాతనమైన ఫ్లోర్ మిల్ మరియు ఉత్తమమైన బిస్కట్ల తయారీ ఫ్యాక్టరీలో తయారు కాబడినవి.

Headstart/ATM/104

## హృదయ ఘోష

ఈ ఉదయం నా హృదయం
స్వాతంత్ర్య సందేశాలు విని కులకటంలేదు.
చీద భారతాన్ని చూసి కుములుతోంది.
దేనికున్నది స్వాతంత్ర్యం ? దేన్ని చూసి సంతసం ?
ప్రతి మనిషికి తిండి బట్ట నిలువ నీడ
దండిగ పండుతున్నాయనా ? సంతోషం ?
మనిషి మనసులో సమతా మమతలు
పొంగిపొరలి వరదలై ప్రవహిస్తున్నాయనా ?
ఆనందం ?
ఊకదంపుళ్ళకే వుంది స్వాతంత్ర్యం ?
ఆదరణలో అది శూన్యం
పిల్లల్ని కనడానికి లేని స్వతంత్రం; వాళ్ళను
పనికిమాలినవాళ్ళుగా చేయడాని కది పుష్కలం;
అందుకే నేనంటాను మనిషి మనసు వికసించాలని
ఈ జెండాల పండగ జాతికి దండగ కారాదని
అందాకా రివాజుగా ఈ రోజుకు స్వాగత గీతి
పాడలేను.
ముందునాటికైనా అందుకు మోజు
పడుతున్నా నేను.
నిరీక్షణా కావ్య నిర్మాణమే నిండైన నేటి
తప్పనిసరి మరి.

— "సునంద"

## ఎగువ - దిగువ

"ఈ ఎగువ ఏభై బళ్ళాగిపోయేయి. ఆ దిగువ నలభై అయిదున్నాయట. నీతో కాపోతే ఎవడితో వాడిస్తాం ? తలకాయ నొప్పి వచ్చి చస్తున్నాం—" అని ఆ ఆవేశపరుడు విసుక్కుంటూ వేపకొమ్మ తెంపి పళ్ళు తోమడం మొదలెట్టేడు.

లారీలాగిపోయిన దగ్గరకెళ్ళేము. అట్నుంచి, యిట్నుంచి రెండు లారీలు క్రాస్‌చేసే ప్రయత్నంలో రోడ్డు దిగి, వర్షానికి బురదైన వల్లమన్నులో టైర్లని యిరికించుకున్నాయి. రోడ్డు తడిగా, ఏడుస్తూ. రోడ్డుపక్కన వల్లమన్ను ఊబిలా. రెండు లారీలూ నేషనల్ పెర్మిట్ లారీలే. వాటిలోని కొండలా ఎత్తుగా ఉన్న లోడు చెట్ల కొమ్మలకి తగుల్తున్నాది. గజేంద్రుడి కాలిని పట్టిన మొసలిలా బంకమన్ను పట్టుకుంది వాటి వెనక టైర్లని. రోడ్డా సింగిలు రోడ్డు. ఏ బండైనా రోడ్డు దిగకుండా తప్పించుకుపోలేదు మరో బండిని! ఆడ, మగ, ముసలి, ముతక ఎందరో పనివాళ్ళు బంకమట్టిని పారలతో తీస్తూ చిన్న చిన్న రాళ్ళను వేస్తున్నారు, లారీలను పైకి లాగేందుకు. యవ్వనాన్ని పనిలో అందరికీ చూపిస్తూ ఆడవాళ్ళు! కాయకష్టంలో శక్తుల్ని

పెరిగిస్తూ మగవాళ్ళు! చదువుకొనే వయసులో వాకిరీలు చేస్తూ పిల్లలు! హేట్లు పెట్టుకొని అజమాయిషీ చేస్తూ కొందరు లాటిక్రరల నాడిస్తూ పనిచెపుతూ పోలీసులు. 'ఆటో' కులమంతా అక్కడే ఈని ఉంది! బుర్రకి తోచింది చెప్తున్నారు వాళ్ళాను. పక్క పల్లెల పిల్లా—పాపె అక్కడే మూగి చూస్తున్నారు.

పన్నెండు టన్నులకి మించిన లోడుతో నేషనల్ పెర్మిట్ లారీలు పన్నెండుకి పైగా ఉన్నాయి టార్పాలిన్లతో లారీల్లోని లోడ్లు దళసరి తాళ్ళతో కట్టబడి ఉన్నాయి. పేసెంజరు బస్సులు, సూపర్ ఎక్స్‌ప్రెస్‌లు, సూపర్ డీలక్సులు, కారులు బారులుగా ఎగువవీ — దిగువవీ ఆపబడి ఉన్నాయి, దూరం దూరంగా, బేచీలుగా. దేవుడి గుడి గోపురంలా ఎత్తుగా గడ్డితో రెండు లారీలున్నాయి.

వేపబ్రష్షుతో పళ్ళు తోముకున్నా. వేడిగా ఏదైనా తాగాలనుంది. ఖాళీగా ఉంది కడుపు. తొమ్మిది దాటింది టైము. మూడు రోజుల లీవు తర్వాత వచ్చిన సూర్యుడు వేడిగా ఉన్నాడు. పాక టీ కోసం యిటు రెండు కిలోమీటర్లు, అటు మూడు కిలోమీటర్లు పోవాలిట. నడిచే ఓపికలేక బస్సెక్కేను. చూసి చూసి అలిసిపోయి నిరాశతో బస్సులో కూర్చున్నారు సగానికిపైగా. నల్లపూసల అమ్మాయిని చూస్తే రాధే గుర్తొచ్చింది. మొగుడు దగ్గరుంటే కాఫీకి తీసుకెళ్ళేవాడేమో! తాతగారిని చూసుకుంటూ ఆయన కూతురు పక్కనే కూర్చుంది. ఆయన దగ్గు మాత్రం ఆపలేదు. మొహాలు తేలేసుకుని కొందరు, నిద్రపోతూ కొందరు పడిగాపులు కాస్తున్నారు బస్సులో. డ్రైవరు, కండక్టరు బయట అజమాయిషీలోనే ఉన్నారు. వాళ్ళిద్దరూ లేని బస్సు అమ్మా—నాన్నా పై ఊరెళ్ళిన యింటిలా ఉంది. సిగరెట్లు మాత్రం ఉన్నాయి, సర్దార్‌జీ పుణ్యమా అని. నా పక్క ఉద్యోగస్థుడు — రామారావు — సిగరెట్టడిగేడు నన్ను. ఇద్దరం కలిసి మళ్ళీ బస్సు దిగేం.

"అసలు మొరం వెయ్యాలి సార్ గట్టర్స్ లోని నల్లమన్నే ఎత్తిపోసేసేరు! బి. సి. సోయిల్ రోడ్డుపక్కనేస్తే ఏమౌతుంది?" అన్నాడతను.

"మొరం దూరంగా పోతేగాని దొరకదు కాబోలు" అన్నా.

"అదీ అవొచ్చు. లేక—" అని నవ్వేడతను.

"అదీ కరక్టేమోలెండి—" అన్నా ఆయన నవ్వులోంచి ప్రతిధ్వనించిన వ్యంగ్యాన్ని ఉద్దేశించి.

"కాఫీ తాగొద్దామా?" అనడిగేడతను.

"బాగా దూరం పోవాలండి. బ్యాగులు కూడా మోసుకెళ్ళాలి—" అన్నా.

దిగబడిన లారీల్లోని బస్తాలన్నీ వేపచెట్టు కింద పెట్టేసేరు. ఎగువ కెళ్ళే లారీ డ్రైవరు స్టార్ట్ చేసేడు. వేసిన రాళ్ళమీంచి మెల్లగా, టైర్లు బురదలో జారుతూంటే, తాగుబోతు వాడిలా ఊగుతూ, దిగువ లారీని ఆ లారీ దాటింది. పనివాళ్ళు, డ్రైవర్లు, క్లీనర్లు, పేసెంజర్లు, టోపీవాళ్ళు, పోలీసులు, పిల్లలు చప్పట్లు కొట్టేరు, గట్టిగా నవ్వుతూ, ఆనందంలో. సమిష్టి కష్టానికొచ్చిన ఫలితం! ఆ లారీని డ్రైవరు బొట్టు చేసుకుంటూ చాలా మంది అలా దారివెంట వెళ్ళేరు. రాను రాను దటాన్న వెహికల్సు దూర దూరంగా ఆపబడి వున్నాయి గట్టి నేలని, కాస్త చోటెక్కువున్న జాగాని చూసుకుని మరీ ఆపుకున్నారు రాత్రి వాళ్ళు. ఓ మంచి చోటు చూసుకుని లారీ నాపి, లోడును మోసుకొచ్చి ఎక్కిస్తున్నారు దాంట్లో. దిగువ లారీ కూడా తూగుతూ తూగుతూ ఊబిలోంచి బైటపడి రోడ్డెక్కింది. దాన్నీ దూరంగా మంచి జాగాలో ఆపి లోడను మళ్ళీ దాంట్లో కెయ్యడం మొదలెట్టేరు.

"మూడు బడులున్నాయండి వినండి—" అని నా మొహాన్ని అతనివైపు తిప్పించేడు రామారావు.

"చెప్పండి, వింటున్నా" అన్నా.

"మొదటో బడిలో న్యాయం తప్ప అన్యాయం లేదు. సేవ తప్ప స్వార్థం లేదు. రెండో బడిలో స్వార్థంతో కూడిన అన్యాయం వుంది. కాని ఆ స్వార్థం ఎవరికీ యిబ్బందిపెట్టనిది. మూడో బడి వుంది. అదే యిది—" అంటూ బురదని చూపించేడు రామారావు

"కరక్ట్ ... కరక్ట్" అన్నా.

"రాత్రి మీరు సిగరెట్ కాల్చడం మూడో బడిలో చేరడమే. అయితే అది చిన్న స్కేలులోది. సర్దార్‌జీ భయంతో మీరా పని మానేసేరు. ఇలాటి ఘోరం ఆపడానికి కూడా ఎవరి భయమో వుండాలి—" అని "మీరేమనుకోలేదుగా?" అనడిగేడు రామారావు.

నేను నవ్వేను. "మీరు బాగా మాట్లాడ

ఏ న్ని కృ ష్ణు డా?



ఫొటో : ఎస్. హెచ్. ప్రసాదరావు.

తారే—" అని అతన్ని ప్రశంసించేను. మేం బస్సులో కెళ్ళేసరికి అంతా ఆనందంగా కనిపించేరు. డ్రైవరు సీట్లో డ్రైవరు, కండక్టరు సీట్లో కండక్టరు కూర్చునున్నారు. మా బస్సు పదకొండో నంబరులో వుంది. "టీ–టీ–" అని సర్దార్‌జీతోపాటు సుగ్గురు అరిచేరు. "పావుగంటలో వెళ్తాం. ఇక్కడ మంచి టీ దొరకదు" అన్నాడు కండక్టరు. పదిన్నరవుతూంటే స్టార్టరు నొక్కేడు డ్రైవరు. అందరం బయటికి చూస్తూంటే తూలుకుంటూ, తూలుకుంటూ బస్సు దాటులోంచి తక్కిన బళ్ళని. దిగువ బస్సులు కూడా కదులుతున్నాయి మెల్లగా. మైలుదాకా ఆపున్న వెహికల్సు కనిపిస్తూనే వున్నాయి.

ఓ పెద్ద కల్వర్టుమీద మరో బస్సుని మా బస్సు క్రాస్‌చెయ్యగానే "ఏమండీ—" అన్న పిలుపు వినిపించింది. అది నేను బాగా ఎరిగిన కంఠం. వెంటనే కిటికీలోంచి తలని బయటికిపెట్టి చూసేను. అవతలి బస్సులో రాధ మొహం, ఊపుతూన్న చెయ్యి కనిపించేయి. "రాధా—" అని గట్టిగా అరిచేను అప్రయత్నంగా. బస్సులో అంతా నావైపే చూసేరు. "ఆపండాపండి, నే దిగిపోతా" అని "తాడు బెల్లుని" అందుకొని గట్టిగా కొట్టేను. రామారావు ఆశ్చర్యంగా నన్ను చూస్తూంటే, "నా వైఫ్" అని, బ్యాగు తీసుకొని కాళ్ళతో దార్లో వున్న అందర్నీ తన్నేస్తూ నడిచేను. మా బస్సు దిగగానే దూరంగా ఆగిన ఆ బస్సుని చూసి, మా బస్సు తలుపుని వెయ్యకుండా, పరిగెట్టేను. ఆ బస్సులోకి నే నెక్కేసరికి రాధ తలుపు దగ్గరే నిలబడి వుంది. రాధ పక్కన కూర్చున్నావిడ ముందు సీట్లోకి వెళ్ళగానే నేను రాధ పక్కనే కూర్చున్నాను. అందరూ మావైపే చూస్తూంటే కండక్టరు టిక్కెట్టు కోసం వచ్చేడు. టిక్కెట్టు తీసుకున్నాక ఆయాసం కొంచెం తగ్గింది నాకు

"ఉత్తరం రాయకుండా బయల్దేరేవేం?" అనడిగా రాధని మెల్లిగా.

"మీరెందుకు రాయలేదు?" అంది రాధ.

"నిన్ను సర్‌ప్రైజ్ చేద్దామని—" అన్నా.

"నేనూ అంతే" అంది రాధ.

"ఎప్పుడాగిపోయింది మీ బస్సు?" అనడిగా.

"తెల్లారుఝామున రెండుగంటలకి. మీది?"

"మాదీ రెండుకే."

"కాఫీ తాగేరా?" అని రాధ అడిగితే లేదన్నట్లు పెదాలు విరిచేను నేను.

"వెనక్కివెళ్ళి తాగేం మేం" అంటూ ముందున్న వాళ్ళనిద్దర్నీ చూపించింది రాధ.

"ఛఛ, ఎంత పనైంది, కాఫీ కొద్దామనుకునే మానేసేను. వస్తే నిన్ను కలిసేవాణ్ణి! ఈ టైమంతా కలిసే వుండేవాళ్ళం!!" అన్నా.

ఇద్దరం ఒకళ్ళని చూసి ఒకళ్ళం నవ్వుకున్నాం. నల్లమన్ను మమ్మల్ని కలిపింది! మాపాలిటి కీడు కాదు, మేలు అయింది! 'నా' ఊర్లో మేం ఇద్దరం రిక్షా ఎక్కేసరికి నాలుగున్నరయింది! ●



# ఇంటా బయటా అన్ని పనులకు సూర్యభగవానుడి నుంచి శక్తి!

ధాన్యం ఆరబెట్టటానికి, చేపలు ఎండబెట్టటానికి, కొబ్బరినూనె తీయటానికి, చేపలమడుగులను వేడి చేయటానికి, వంటగ్యాసు సరఫరాకు, నీటిని శుద్ధి చేయటానికి, కరెంటు తయారు చేసుకొనటానికి సౌర శక్తిని వినియోగించవచ్చునని ఇటీవల అట్లాంటా (అమెరికా)లో సమావేశమైన శాస్త్రజ్ఞులు వెల్లడించారు. పదిహేను దేశాలకు చెందిన శాస్త్రజ్ఞులు "గ్రామాలకు పనికివచ్చే సోలార్ టెక్నాలజీ" అనే అంశంపై ఇటీవల ఒక గోష్ఠి నిర్వహించారు. ఇండియా, నేపాల్, శ్రీలంక, ఆఫ్ఘనిస్తాన్, గయానా, ఫిలిప్పీన్స్, అమెరికా, బ్రిటన్, కెనడాలకు చెందిన శాస్త్రజ్ఞులు ఈ గోష్ఠిలో పాల్గొన్నారు.

గ్రామాలలో దొరికే పరికరాలు, పదార్థాలతో సోలార్ ప్రక్రియలను అమలుజరపటం సాధ్యమేనని ఈ శాస్త్రజ్ఞులు వెల్లడించారు.

కెనడాలోని ఒక గ్రామంలో సోలార్ వడపోత పద్ధతిని విజయవంతంగా అనుసరిస్తున్నట్లు మాంట్రియల్‌కి చెందిన డాక్టర్ థామస్ లేనండ్ చెప్పారు "ఆ ప్రాంతంలో 14 మాసాలపాటు వర్షాలు పడలేదు. బావి నీరు కటిక ఉప్పు. కొన్ని రోజులపాటు ఆ గ్రామస్థులు తిండికి, మంచినీటికి విపరీతంగా బాధపడ్డారు. చివరకు వీరు బ్రాస్ ఇన్‌స్టిట్యూట్ అనే ఒక సంస్థ సహకారంతో సౌర శక్తితో ఉప్పునీటిని మంచినీరుగా మార్చుకోగలిగారు" అని ఆయన చెప్పారు.

## గోబర్ గ్యాస్ యంత్రాలు

ఇండియాలో సౌర శక్తి పరికరాలపై ముమ్మర పరిశోధనలు జరుగుతున్నాయి. అనేక మంది శాస్త్రజ్ఞులు ఈ పరిశోధనలలో పని చేస్తున్నారు భారతీయ శాస్త్రజ్ఞులు రూపొందించిన పరికరాలలో ముఖ్యమైనది గోబర్ గ్యాస్ యంత్రం. పశువుల పేడతో మిథేన్ వంట గ్యాసు తయారుచేసే యంత్రం ఇది.

## గుజరాత్ గ్రామంలో సోలార్ సెల్

గత 18 మాసాలుగా అవానియా అనే మారుమూలన ఉన్న ఒక గుజరాత్ కుగ్రామంలో 1401 మంది ప్రజలకు సౌర శక్తి వినియోగం ద్వారా మంచినీటి సరఫరా జరుగుతున్నది ఈ గ్రామానికి విద్యుచ్ఛక్తి కూడా లేదు. సెంట్రల్ సాల్ట్ అండ్ మెరీన్ కెమికల్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్ (భావనగర్) మురికినీటి నుంచి మంచినీరు తయారుచేసే ఒక యంత్రాన్ని నెలకొల్పింది. ఈ యంత్రం సౌరశక్తితో పనిచేస్తుంది. ఇది రోజుకి 5000 లీటర్ల మంచినీటిని గ్రామస్థులకు సరఫరా చేస్తున్నది.

## సోలార్ నగరం

అల్జీరియాలో ఒక సోలార్ నగరాన్నే నిర్మిస్తున్నారు. అల్జీర్స్‌కి దక్షిణంగా 250 కిలోమీటర్ల దూరంలో అషెమి ఎడారి ప్రాంతంలో ఈ నగరం నిర్మిస్తున్నారు. 1400 హెక్టేర్ల విస్తీర్ణంలో సకల సౌకర్యాలతో సోలార్ నగరం నిర్మాణమౌతుంది. ఇందులో 40 హెక్టేర్ల భూమిలో గ్రీన్ హౌసులు నిర్మిస్తారు. భూగర్భ జలాన్ని ఈ గ్రీన్ హౌసులలోని పంటలకు వినియోగిస్తారు. అల్జీరియాలో దక్షిణాది ప్రజలు ఉత్తరాదికి వలసపోకుండా ఇలాంటి సోలార్ పథకాలు నివారించగలవని అల్జీరియన్ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

ఇండియాలో గ్రామీణ ప్రాంతాలలో సోలార్ వ్యవస్థలను నిర్మించటానికి పథకాలు తయారౌతున్నట్లు మదరాసు పి. ఎస్. యూనివర్సిటీ ఆఫ్ టెక్నాలజీకి చెందిన పి. సి. చంద్రశేఖరన్, ఓక్లహామా స్టేట్ యూనివర్సిటీకి చెందిన ఆర్. రావు, ఏ. కుమార్ చెప్పారు.

ఫిలిప్పీన్స్‌లో హోటళ్లలో, రెస్టారెంట్లలో, తదితర ఇన్‌స్టిట్యూషన్లలో సోలార్ వాటర్ హీటర్లను విజయవంతంగా వినియోగిస్తున్నారు. కొబ్బరికాయలు, మామిడిపండ్లు ఎండబెట్టుకొనటానికి సోలార్ డ్రయింగు పరికరాలు బాగా ఉపయోగపడుతున్నాయి.

గయానాలో సోలార్ డ్రయర్లతో చేపలు, మాంసం ఎండబెట్టుకొంటున్నారు. కాగా ఇండోనీషియాలో వేరుసెనగనూనె, కొబ్బరినూనె తీయటానికి సోలార్ యంత్రాలు వినియోగించుకొంటున్నారు. గ్రామాలలో కాయధాన్యాల నుంచి నూనె తీయటానికి ఈ పరికరాలు బాగా పనికి వస్తున్నాయి.

ఇంగ్లండులో చేపల మడుగులను వేడి చేయటానికి, పుట్టగొడుగులు, తదితర పంటలు పండించే గ్రీన్ హౌసులను వేడి చేయటానికి సోలార్ పరికరాలను వినియోగిస్తున్నారు. సౌర శక్తితో వేడిచేసే తటాకాలలోని చేపలు ఇతర మడుగులలోని చేపల కంటే 50 శాతం అధికంగా పెరుగుతున్నాయి.

నైరుతీ ఆరిజోనా (అమెరికా)లోని పపాగో అనే రెడ్ ఇండియన్ రిజర్వేషన్‌లో సౌరశక్తి ద్వారా కరెంటు తయారు చేసుకొంటున్నారు. ఆ గ్రామస్థులు రిఫ్రిజిరేటర్లకు, లైట్లకు, వాషింగ్ యంత్రాలకు, కుట్టు మిషన్లకు సౌర విద్యుచ్ఛక్తినే వాడుకొంటున్నారు. ఇంతకుముందు వీరి ఈ అవసరాలకు డీజిల్ ఆయిల్, కిరోసిన్ వాడేవారు. పరిసర గ్రామాలకు వెళ్లి ఐస్ తెచ్చుకొనేవారు కాగా, ఇప్పుడు అదే ఖర్చుతో, సౌర విద్యుచ్ఛక్తి ద్వారా ఈ అవసరాలన్నీ తీర్చుకొంటున్నారు.

[—ఇవర్లీ డిస్కవర్] ●



**తండ్రి ఎంతో తనయుడు అంతే!**

**"దానిని మీరు ఇప్పుడు మాల్టోవా అంటున్నారు. అయితే నేను టెన్నిస్ ఆడటం ప్రారంభించినప్పటి నుండి అది నాకు పరిచితం..."**

అంటాడు డేవిస్‌కప్ మేటి, భారతీయ టెన్నిస్ ప్రథమశ్రేణి క్రీడాకారుడు ప్రేమ్‌జిత్‌లాల్.

**"మాల్టోవా, టెన్నిస్ ఆట - మా కుటుంబ రక్తంలోనే ప్రవహిస్తున్నాయి!"**

అని భారతీయ టెన్నిస్ రంగంలో కొత్తగా అడుగుపెట్టి ప్రతిభను ప్రదర్శిస్తున్న ప్రేమ్‌జిత్‌లాల్ తనయుడు, దేవ్‌లాల్, అంటాడు.





# మాల్టోవా
# చురుకయిన జీవితానికి కావలసిన శక్తినిచ్చే రుచికర పానీయం.

ప్రేమ్‌జిత్‌లాల్, దేవ్‌లాల్.
తండ్రి గొప్పవాడు, తనయుడు గొప్పవాడు. టెన్నిస్ క్రీడలో ప్రీతి, చురుకుతనం ఇప్పుడు మాల్టోవా అనే పానీయంలో ప్రత్యేక అభిరుచి వంటి నిరంతర కుటుంబ సంప్రదాయాలతో కట్టుబడిన తరాలు.

శరీరానికి పుష్టినిచ్చే ప్రొటీనులు, ఆరోగ్యాన్ని కాపాడే విటమినులు, ఖనిజాలు ఉంటే – చురుకుదనం ఉంటుందని, విజయం సాధించేందుకు అదనపు శక్తి వస్తుందని, విజేత అయ్యేందుకు వీలవుతుందని – ప్రేమ్‌జిత్‌కులా – దేవ్‌కు కూడా తెలుసు. మరి 17 సంవత్సరాలు ప్రేమ్‌జిత్ అద్భుతంగా డేవిస్ కప్ ఆడాడంటే ఆశ్చర్యమేముంది! అదే ఉజ్వల భవిష్యత్తులోకి అడుగుపెడుతున్నాడు, దేవ్.




500 గ్రా.
రు. 13.99
స్థానిక పన్నులు అదనం.



**మాల్టోవా**
**విజయ పరంపరల ప్రత్యేక రుచిని పెంపొందించేందుకు**

ASP/JIL/10/105 TL

**JiL** జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

# సమస్యా పరిష్కారం

మనుష్యుడై పుట్టిన తర్వాత జీవితంలో ఎన్నో సమస్యలు ఏర్పడతాయి. సమస్యలన్నీ దరిద్రులకే ఉంటాయనీ, ధనికులకు ఉండవనీ, వారు తమ దగ్గర ఉన్న డబ్బువల్ల ఎట్టి చిక్కునయినా పరిష్కరించగలరనీ అనుకోరాదు. ధనమున్నా పరిష్కారం కాని చిక్కులు ఎన్నో ఉంటాయి. ఆరోగ్యానికి గాని, వనవులకు గాని డబ్బుతో నిమిత్తం లేదు. ఇలాంటివి యింకా ఎన్నో ఉంటాయి.

ఈ సమస్యలు మానవుల మనస్సును ఎంతో వేధిస్తాయి. మానవులు క్రుంగిపోవడానికీ, చివరకు మరణించడానికీ కూడా ఇవి కారణమవుతూ ఉంటాయి. ఇట్టి సమస్యలను తీర్చడానికి భగవంతుడికే కాని మానవమాత్రుడికి సాధ్యం కాదని కొందరు అభిప్రాయపడుతూ ఉంటారు. కాని అది సరి కాదు. ప్రయత్నం వల్ల సమస్యా పరిష్కారం సాధ్యమవుతుంది. తీరని సమస్య ఏర్పడి మనస్సు కలతపాటు పొందినప్పుడు మనం చెయ్యవలసిన దేమిటంటే— ఒక కాగితం తీసుకుని దానిమీద మన సమస్యను గురించిన ప్రశ్నలు వ్రాసుకుని, వాటికి మనమే వివరంగా ఆలోచించి సమాధానాలు వ్రాసుకోవాలి.

సాధారణంగా ఆ ప్రశ్నలు నాలుగు ఉంటాయి— అవసరాన్ని బట్టి మరికొన్ని ప్రశ్నలు వేసుకోవచ్చు.

మొదటి ప్రశ్న— మనస్సును బాధిస్తూ వుండే ఆ సమస్య ఏమిటి ? అని. ఈ ప్రశ్న వివరంగా కాకుండా చాలా సంగ్రహంగానే ఉండవచ్చు.

రెండవ ప్రశ్న— ఈ సమస్య ఏర్పడడానికి కారణం ఏమిటి? అని— ఈ ప్రశ్న కొంత విపులంగానే ఉంటుంది. సమస్య కలగడానికి పూర్వ రంగమైన సంఘటనలు, పరిస్థితులు ఈ ప్రశ్నలో చెప్పబడి ఉండాలి.

మూడవ ప్రశ్న— దీన్ని పరిష్కరించడానికి తగిన మార్గాలు ఏవైనా ఉన్నవా? అని— ఇందులో మన ఊహకు అందిన మార్గాలన్నీ సూచించబడాలి.

నాల్గవ ప్రశ్న— సమస్యా పరిష్కారానికి ఉత్తమమైన పద్ధతి ఏది? - అని.

## ధర్మపథం

ఇలా ప్రశ్నలు వ్రాసుకుని, ఇతరులపై ఆధార పడకుండా స్వయంగానే వాటికి సమాధానాలు కూడా వ్రాసుకోవాలి. ఉత్తమ పరిష్కార మార్గాన్ని సహేతుకంగా సమర్థించాలి. ఇతర సాధనాలలోని- ఉపాయాలలోని లోటుపాట్లను వివరించాలి.

ఊరికే ఆలోచించడం కంటె లిఖిత మూలంగా ఉండినప్పుడు నిదానంగా ఆలోచించడానికి ఎంతో అవకాశం ఉంటుంది. ఇలా చేసి, ఉత్తమ పరిష్కారాన్ని అమలులో పెడితే సమస్య తీరిపోగలదు.

—బులుసు వేంకట రమణయ్య







# రాగరశ్మి



సీరియల్

మాధవపెద్ది పుణ్యశీలా ప్రసాద్

27

*(గత సంచిక తరువాయి)*

"వచ్చావా అరుణ్!" అన్నాడు కృష్ణ అరుణ్‌ని చూస్తూనే!

అరుణ్‌ని చూశాక ప్రాణం లేచి వచ్చింది కృష్ణకి. అసలు అరుణ్ వచ్చేదాకా మనశ్శాంతి లేదతడికి.

"మీరిచ్చిన టెలిగ్రాం అందింది—ఏమిటి ఏమున్నా అర్జెంటా?" అన్నాడు అరుణ్ కుశలప్రశ్నలయ్యాక.

"చెప్తాను — కాళ్ళు ఆవీ కడుక్కో" కృష్ణ నెమ్మదిగా అన్నాడు.

శిల్పలో ఏదో మార్పు కనబడుతోంది అరుణ్‌కి. అరుణ్‌ని చూడంగానే ఒక్కసారి తళుక్కుమని మెరిసింది ఆమె మొహం!

ఆది ఒక క్షణకాలమే — మరికాసేపటికి ఉదాశీనంగా మారిపోయిందా మొహం!



తనమీద అలకా? తీర్చాలి అనుకున్నాడు. కళ్ళల్లో చిందులేసే చిలిపితనం లేదు. గంభీరంగా వున్నాయా కళ్ళు. కృష్ణ ఆక్సిడెంట్ తర్వాత, శిల్పలో కొంత మార్పు వచ్చినమాట నిజమేగనీ, అది ఇంతదాకా వుంటుందా? ఇంక శిల్ప మామూలుగనే వుండదా? ఆ విచారాన్నంతా తను పోగొట్టాలి! పెళ్ళయ్యాక తిరిగి మామూలుగా ఇన్నటిలాగా నవ్వేటట్లు చెయ్యాలి తను!

నవ్వించే మాటలు లేవు మురిపించే చిరునవ్వు లేదు. సంతోషం అసలే లేదు. కొత్తగా ఆ గాంభీర్యం ఎక్కణ్ణించి కొని తెచ్చుకుంది? ఆ గాంభీర్యం తనని దూరంగా నిలబెడుతోంది! ఆనిర్లిప్తత తనకి అశాంతిని కలిగిస్తోంది తను మాట కలపబోయినా సంభాషణ తుంచేస్తోంది! ఎందుకు? ఎందుకు? కారణమేమిటి?

నీళ్ళు తోడేటప్పుడూ, అన్నం వడ్డించేటప్పుడూ, కాఫీ అందించేటప్పుడూ, పక్క వేసేటప్పుడూ, కళ్ళు వాల్చుకునే వుంది శిల్ప! ఆ కళ్ళల్లో ఏముందో చదవాలని ప్రయత్నించినా సాధ్యం కావడం లేదు ఏమిటిది? ఏమిటిది? నిలవలేక పోతున్నాడు అరుణ్! ఏదో అశాంతిగా వుంది! అసహనంగా వుంది! శిల్ప ధోరణి అంతుపట్టడం లేదు. కోపం వస్తోంది! ఇంకా నిన్నాళ్ళట్నా?

ఇంక ఉండబట్టలేక- శిల్ప విషయం సూచాయగా కృష్ణని అడిగాడు అరుణ్! కృష్ణ కూడా సంభాషణ ఎలా మొదలుపెట్టడమా అని ఆలోచిస్తున్నాడు

"ఆ సంగతి చెబుదామనే నీకు టెలిగ్రాం ఇచ్చాను అరుణ్. మనకిప్పుడొక పెద్ద

**జరిగినకథ 13** శిల్పకి బెంగుళూరు లోని కెనరా బ్యాంక్‌లో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్తుంటే రైలు కోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడుతుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది. అవివాహితు డైన తనతో శిల్ప ఉంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్తాడు కృష్ణ. అరుణ్‌తో అర్చనకి పెళ్ళి నిశ్చయమయిందని శిల్పకి చెప్తుంది వైదేహి. అర్చనని పెళ్ళి చేసుకోవటం అరుణ్‌కి గాని, అరుణ్‌ని పెళ్ళి చేసుకోవటం అర్చనకి కాని యిష్టముండదు. అరుణ్ శిల్ప ఒకరి నొకరు ప్రేమించుకుంటారు. చిత్రని పెళ్ళి చేసుకుంటానని ఆమె తండ్రి వెంకట్రావ్‌తో కృష్ణ చెప్పగ, ముహూర్తం పెట్టిస్తాడు. శిల్ప పూర్వ వృత్తాంతం గురించి అరుణ్‌తో చెపుతూ వుంటాడు కృష్ణ. తను ప్రయాణించే రైలులో దొరికిన పాపను తీసుకొని తన ఇంటికి చేరుకుంటాడు కృష్ణ. ఆ పాప మూలముగా కృష్ణ, చిత్రల మధ్య మనస్పర్థలు చెలరేగుతాయి. కొన్నాళ్ళకు చిత్ర మరొకరిని పెళ్ళి చేసుకొంటుంది. శిల్ప పెళ్ళి అరుణ్‌తో నిశ్చయమవుతుంది. ఆ పెళ్ళి పనుల తొందరలో కృష్ణకి 'యాక్సిడెంట్' జరుగుతుంది. ఆ యాక్సిడెంట్‌లో కృష్ణకి ఒక కాలూ, చెయ్యీ పోగా, శిల్ప పెళ్ళి ఆగి పోతుంది. అర్చన పెళ్ళి అనిరుధ్‌తో జరిగిపోతుంది. కృష్ణ ఇచ్చిన టెలిగ్రామ్‌ను అందుకొని రైలులో వస్తుండగా, చిత్ర, ఆమె తండ్రి వెంకట్రావ్‌తో పరిచయమవుతుంది అరుణ్‌కు.

చిక్కు వచ్చి పడింది. దానిని చాలా జాగ్రత్తగా విడదీయాలి."

"ఏ విషయం...? ఏమిటా చిక్కు?" అర్థం కాలేదు అరుణ్‌కి.

"ఏం లేదు... శిల్ప... పెళ్ళి వద్దంటోంది"

షాక్ తిన్నాడు అరుణ్! నిశ్చేష్టుడయ్యాడు! నిర్విణ్ణుడయ్యాడు! నోట మాట రాలేదు! కొంతసేపు ఏమీ మాట్లాడలేక పోయాడు!

ఆ తరువాత చాలా సేపటికి తేరుకుంటూ "అసలు పెళ్ళే వద్దంటోందా! లేకపోతే ఇప్పుడే వద్దంటోందా?" అడిగాడు.

"ఏమో! అసలు పెళ్ళే వద్దుట! పెళ్ళి చేసుకుని తను వెళ్ళిపోతే నేను ఒంటరివాణ్ణి అవుతానట."

"ఒంటరివారు ఎందుకవుతారు? అసలు తను ఎక్కడికి వెళ్తుందిట? మేము ఉండబోయేది ఇక్కడే గదా?"

"ఏమిటో అరుణ్ ఆమె ఆలోచన లేమిటో ఒక విధంగా లేవు" అంటూ తామిద్దరికీ మధ్య జరిగిన సంభాషణను చెప్పాడు కృష్ణ అరుణ్‌తో.

ఆలోచిస్తున్నాడు అరుణ్.

"అప్పట్నుంచీ నే నెంత బాధ పడుతున్నానో నీకు తెలీదు అడపిల్ల పెళ్ళి చేసుకోకుండా ఎంతకాలం వుండగలదు? చెబితే అర్థం కాదు. నువ్వు కూడా మాట్లాడి చూడు... వినకపోతే..."

"ఆఁ! వినకపోతే?"

"పెళ్ళి ముహూర్తం వీలైనంత తొందర్లో పెట్టించి పెళ్ళి జరిపించెయ్యడమే మనమీద ముందు కోపంతెచ్చుకున్నా, ఆ తరువాత తనే సర్దుకుంటుంది. పిచ్చిపిల్ల - తొందరపాటులో అంది.

కాని, తరువాత నువ్వనచ్చచెబితే మనసు మార్చుకోవచ్చు. నువ్వేమీ బాధ పడకు అరుణ్! ఈ పెళ్ళి జరిపించే బాధ్యత నాది. ముందు నయాన నచ్చచెప్పి చూడు."

కృష్ణ ధైర్యం చెబుతూ మాట్లాడాడు.

అన్యమనస్కంగా లేచాడు అరుణ్ - ఉత్సాహమంతా మాయమైంది అతడిలో.

* * *

"చూడమ్మా శిల్పా, అరుణ్ నీతో మాట్లాడాలిట, వెళ్ళు." పక్కలన్నీ వేసి మంచినీళ్ళు పెట్టి వెళ్ళిపోబోతున్న శిల్పతో అన్నాడు కృష్ణ.

"అబ్బ...నాకు నిద్రొస్తోంది బాబాయ్."

"చెప్పిన మాట విను మరి" ప్రేమగా మందలిస్తూ చెప్పాడు కృష్ణ.

కాదనలేక పోయింది శిల్ప.

కృష్ణ టెలిగ్రాం ఇచ్చి అరుణ్‌ని పిలిపించాడనేది తెలుసు శిల్పకి. అతడు వస్తాడనీ తెలుసు. వస్తే ఏం మాట్లాడాలో అనేకసార్లు రిహార్సిల్సు వేసుకుని వుంది. కానీ... ఇప్పుడు ... ఆ ధైర్యమంతా ఏమైందో మరి! అతడడిగే ప్రశ్నలకి జవాబు చెప్పాలంటే జంకు. అతడ్ని బాధ పెట్టాలే అనే చింత - అతడి ఎదుట పడాలంటే సంకోచం, అతడు ఒప్పుకోకపోతే ఏం చెయ్యాలో అనే ఆందోళన, వీటన్నిటితో బాటు ఏదో తెలియని భయం కూడా కలగసాగింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి శరీరం కంపించటం మొదలు పెట్టింది. అతడి ముందుకు వెళ్తుంటే, కాళ్ళు తడబడు తున్నాయి. గుండె దడదడ లాడుతోంది.

గార్డెన్‌లో రెండు కుర్చీలు వేసి వున్నాయి. వెన్నెల పరుచుకుని వుంది తోటంతా. ఒక కుర్చీలో వెనక్కి వాలి కూర్చొని వున్నాడు అరుణ్

ఆ రోజు ఇట్లాంటి టైములోనే శిల్ప కథంతా చెప్పాడు కృష్ణ ఆ సంగతే ఆలోచిస్తూ కూచున్నాడు అరుణ్ శిల్పకోసం ఎదురు చూస్తున్నాడు. శిల్ప మెల్లిగా వచ్చింది.

"కూచో శిల్పా..." అన్నాడు అరుణ్, కుర్చీలో సరదుకు కూచుంటూ!

కూచుంది శిల్ప.

తామిద్దరూ ప్రేమికులు. పెళ్ళి చేసుకోబోయేవారు. ఎదురెదురుగా వున్నారు. ఏకాంతం వుంది. వెన్నెల తోడైంది. చల్లగాలి సుమసౌరభాలు! ఇంకో సమయంలో అయితే హాయిగా గడిపేవారు. కాని ఇప్పుడు? పరిస్థితి వేరు! ఇద్దరూ దగ్గరే వున్నా, కలుసుకునే స్థితిలోనే లేరు. మనస్సులో ఉత్సాహంలేదు. మనసారా నవ్వలేని అశాంతి.

ఎందుకు శిల్ప ఇట్లా మారిపోయింది? శిల్పవంక చూశాడు. మౌనంగా కూచుని వుంది. మూర్తీభవించిన ముగ్ధలాగా వుంది.

"శిల్పా .. మీ బాబాయిగారు నాతో చెప్పింది నిజమేనా?"

మాట్లాడలేదు శిల్ప. గుండె కుదుట పరుచుకుంటోంది.

"మాట్లాడు శిల్పా..."

"అవును..."

ముందు తెలిసిన విషయమే అయినా

# ఛాంపియన్ డిటర్జెంట్ కేక్ !

# 1అప్

మరింత
తెల్లదనంతో
మీకు
విజయం!



అధిక తీవ్రంగా పని
చేసే మరుగ, అధికంగా
తెలుపుచేసే పదార్థాలతో
శక్తి, దాంతోటే శుభ్రతతో
పాటు తెల్లదనాన్ని
యిస్తుంది మీకు వన్-అప్.
దాంతో తెల్లవాటికి మరింత
తెలుపు, రంగువాటికి
మరింత మెరుపూ వస్తుంది





మీకు
డబ్బులో
మరింత
ఆదా!



వన్-అప్, మరే యితర
డిటర్జంట్ కేక్ కన్నా
ఎక్కువకాలం మన్న
తుంది. ఎందుకంటే,
వాడగానే తొందరగా అరి
పోతుంది గనక. అంటే
ఉతికే ప్రతిసారీ మీరు
డబ్బును ఆదా
చేస్తున్నారన్నమాటే!





తెల్లదనానికి మీ పాలిటి ఛాంపియన్!

ASP/WL-1UP 2R

విట్‌కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.

# రాగరేఖలు

శిల్ప నోటితో "అన్నయ" అని వినగానే మనసు మళ్ళీ బాధకు లోనయింది!

పైకది కనబడనీయకుండా "ఎందుకిట్లాటి నిర్ణయాని కొచ్చావు?" అన్నాడు

"బాబాయ్ కోసం..."

"అంటే?"

"నేను పెళ్ళి చేసుకుని, నా స్వార్థం చూసుకుంటే, బాబాయ్ ఒంటరిగా వుండిపోతారు పెళ్ళయ్యాక ఇప్పుడు నేను చేసే సేవలు చెయ్యలేనేమో."

"ఏం ఎందుకు చెయ్యలేవు? నేను వద్దంటానా?"

"ఇప్పుడు వేరు. ఆ తరువాత నాకు కొన్ని అదనపు బాధ్యతలు వస్తాయి కదా — నాకే తీరిక వుండకపోవచ్చు... ఉద్యోగం చేస్తూ భార్యగా నా విధుల నిర్వహిస్తూ బాబాయి పనులకు అటెండ్ అవగలనా — అనేదే నా సందేహం."

"పోనీ ఉద్యోగం మానేద్దువుగానీ... దానికి పెద్ద ఆలోచించాల్సింది ఏముంది?"

"సరే. మీరన్నట్టే ఉద్యోగం మానేస్తాను. కొన్నాళ్ళు బాబాయ్ని చూసుకుంటాను. ఆ తరువాత మనకి పిల్లా పాపా అంటూ ఏర్పడ్డాక ఆ ఉద్యోగం వుండదూ?"

"అబ్బ శిల్పా! అనవసరంగా ఏవేవో వూహించుకుని మనసు పాడు చేసుకుంటున్నావు."

"ఊహించుకోవడం కాదండీ జరగబోయేదే అది. అయితే సరే లే వద్దంటారా చెప్పండి!" మాట్లాడలేదు అరుణ్. అతడికి కోపం వస్తోంది, ఆమె మాటలు వింటున్నకొద్దీ!

"ఇప్పుడయితే ఈ వూరు ట్రాన్స్ఫరయింది మీకు ఇంకొన్నాళ్ళకి ఇంకో వూరు మార్చరూ? అప్పుడు నేను మీతో రావద్దూ? బాబాయ్ని రమ్మంటే మనతో వస్తారా? అట్లాగని నేను బాబాయితోనే వుండిపో నంటే మీరు ఊరుకుంటారా చెప్పండి!"

"... ... ... ... ..."

"ఇప్పుడు మీరు సరేనన్నా ఇది జరిగేది కాదు పెళ్ళయ్యాక మనమెట్లా మారిపోతామో మనకే తెలీదు"

"అందుకని నువ్వు పెళ్ళి చేసుకోకుండా వుండిపోతే మీ బాబాయి సంతోషంగా వుంటాడనుకుంటున్నావా? నన్నూ మీ బాబాయినీ గూడా బాధపెట్టి నువ్వు సాధించేదేమిటి?"

"ఇది ఆయనకూ, మీకూ బాధాకరమే. కాదనను నిజమే, కానీ ఆయనని కనిపెట్టి వుండాల్సిన బాధ్యత నాది మీకు తెలీదండీ. మీకు అర్థంకాదు నా బాధ. ఆయన తన జీవితమంతా నా కోసం ధారపోశారు. నా కోసమే పెళ్ళి కూడా మానుకున్నారు. ఊరూ పేరూ తెలీని నన్ను ఇంతదాన్ని చేశారు ఆఖరికి- ఆఖరికి నాకోసమే తిరుగుతూ, ప్రమాదానికి లోనయ్యారు. నా వల్లనే ఆయనకి కాలు విరిగిపోయింది. నా కోసం ఇంత త్యాగం చేసిన, ఇంత బాధపడిన బాబాయి కోసం నేనీ మాత్రం చెయ్యలేనా? చెయ్యడం నా బాధ్యత కాదా? మీరే చెప్పండి!"

"బాధ్యత శిల్పా! కాదనడంలేదు. కానీ పెళ్ళి చేసుకునే ఆ బాధ్యతని నిర్వర్తించమంటున్నాను"

"పెళ్ళి చేసుకుంటే అది వీలు కాదని నా అనుమానం."

అరుణ్ మాట్లాడలేదు.

"ఆయన మామూలగా వుంటే అదో తీరు. పెళ్ళి చేసుకుని భార్యనున్నా నేను ఇన్ని ఆలోచించేదాన్ని కాదు కానీ ఇప్పుడు ఆయన్ని నమ్ముకునే వాళ్ళెవరు? పనివాళ్ళు వున్నా ఇంటి వాళ్ళలా చూసుకుంటారా? రామయ్య లాంటి వాళ్ళు మళ్ళీ దొరకరు"

ఇంక శిల్పతో వాదించ లేననిపించింది అరుణ్కి ఆలోచించగా కృష్ణ చెప్పినట్లు త్వరగా ముహూర్తం పెట్టించడం మంచిదని అనిపిస్తోంది అతడికే

కానీ... కానీ... అది బలవంతపు పెళ్ళి అవుతుందేమో! అరుణ్ని ఆలోచనలు చుట్టుముట్టాయి.

## 28

ఆ రాత్రి ఎవ్వరికీ నిద్రలు లేవు.

కృష్ణకి శిల్ప, అరుణ్ల మాటలు కొన్ని అస్పష్టంగా వినబడ్డాయి.

అరుణ్ చెప్పినా శిల్ప వినలేదనీ తన మొండి పట్టుదల వదలలేదనీ కృష్ణకి అర్థమయిపోయింది ఏం చెయ్యాలి? దీనికి ఏంచెయ్యాలి? ఆలోచనలతోనే తెల్లవారింది. ఒక నిశ్చయానికి రాలేకపోయాడు కృష్ణ. ఏమో అరుణ్ శిల్ప మాటలకి ఏమనుకున్నాడో ఈ పెళ్ళి జరగదేమో? ఎలా? ఇదే చింత! శిల్పకి తను ఇంకోసారి నచ్చచెప్పి చూడాలని అనుకున్నాడు.

కాఫీ తీసుకువచ్చింది శిల్ప. స్వచ్ఛంగా, అమాయకంగా ఆమె మొహం చూస్తుంటే కోపం కలగడం లేదు కృష్ణకి.

"కూచోమ్మా శిల్పా!"

వెళ్ళబోతున్న శిల్ప ఆగి వెనక్కొచ్చింది.

"ఏం బాబాయ్, ఏమన్నా కావాలా?"

"అరుణ్ ఇంకా లేవలేదా?"



# దగ్గు గప్‌చిప్

**వచ్చేసింది**
**నమ్మకమైన మందు**
**కొత్త ప్యాక్‌లో**

గ్లైకోడిన్ అలాంటి ఇలాంటి మామూలు దగ్గు మందుకాదు. భారత దేశంలో దగ్గు చికిత్సకోసం వాడే మందులలో దీనిది ప్రథమ స్థానం.

**గ్లైకోడిన్ అన్ని రకాలైన దగ్గులనుంచి శమనాన్నిస్తుంది.**

- మెదడులో, దగ్గాలని అనిపించే కోరికను కలగనివ్వదు.
- ఛాతీలో, పట్టుకున్నేలాంటి అసౌకర్యాన్ని దూరంచేసి విశ్రాంతినిస్తుంది.
- గొంతులో, గరగరలాడటంనుంచి ఉపశమనం యిస్తుంది.
- ఊపిరితిత్తుల్లోని, కఫాన్ని బయటకు తెచ్చేస్తుంది.

**బాధపెట్టి, అసౌకర్యపరిచే అన్ని రకాల దగ్గులనుంచి శమనానికి గ్లైకోడిన్‌ని విశ్వసించండి**




ఆలెంబిక్—డాక్టర్లకు వీరి మందులపై విశ్వాసం ఉంది.

## గ్లైకోడిన్ దగ్గుల్ని తగ్గించడంలో భారతదేశంలో ముందడుగు.

everest/78/ACW/236-tl

# రాగ రేఖలు

"లేచినట్టు లేదు..." అంది తల వంచుకునే

"నీతో కొన్ని విషయాలు చెప్పాలి అట్లా కూచోమ్మా."

కూచుంది.

"చూడమ్మా. రాత్రి అరుణ్ నీతో మాట్లాడాడు గదా? ఏం నిర్ణయించుకున్నావు?"

మాట్లాడలేదు శిల్ప

"చూడమ్మా శిల్పా! అరుణ్ చాలా మంచివాడు. అతణ్ణి బాధ పెట్టడం మనకి భావ్యం కాదమ్మా! నా మాట విని పెళ్ళికి ఒప్పుకో! మీరెక్కడున్నా ఎక్కడికి వెళ్ళినా నేను మీతోనే వస్తాను. నీ చేత సేవ చేయించుకుంటాను.' నాకోసం నువ్వీ పెళ్ళి మానితే నాకు చాలా బాధగా వుంటుందమ్మా- దయచేసి నన్ను అర్థం చేసుకో. మీ ఇద్దరూ పెళ్ళి చేసుకుని చిలకా గోరింకల లాగా నా కళ్ళెదుట తిరుగుతుంటే నాకెంత సంతోషంగా వుంటుంది? ఈ ఇంట్లో పాపాయిలు పారాడుతుంటే ఎంత అందంగా వుంటుంది? నాకు పిల్లలంటే ఎంత ఇష్టమో నీకూ తెలుసుగా? నీ పిల్లల చేత 'తాతయ్యా' అని పిలిపించుకోవాలని నా చిరకాల వాంఛ! ఏ జన్మలో ఏ పుణ్యం చేసుకున్నానో నీలాంటి కూతుర్ని పెంచే భాగ్యం కలిగింది. నాకా కన్యాదాన ఫలం గూడా దక్కనీ తల్లీ! అప్పుడే నాకు తృప్తి. నా ఈ ఒక్క కోరికా తీర్చు. చిన్నప్పుడు నువ్వు ఏదడిగితే అదల్లా ఇచ్చాను నాకు ఇదొక్కటే ఇవ్వు చాలు. ఇంక నిన్నేం కోరను. నువ్వేదడిగితే అది చేస్తాను. నా తల్లివి గదూ? నా మాట వింటావు కదూ?"

శిల్పకి కన్నీళ్ళొచ్చేశాయి. "డాడాయ్" కృష్ణని పట్టుకుని ఏడ్చింది దీనంగా.

అరుణ్ లేచినట్టున్నాడు. మొహం కడుక్కుని గదిలోపలికి వచ్చాడు. మొహం గంభీరంగా వుంది! శిల్ప లేచి వెళ్ళింది లోపలకి.

"కూచో అరుణ్" అన్నాడు కృష్ణ.

అరుణ్ కూచున్నాడు మౌనంగా. శిల్ప కాఫీ తీసుకువచ్చింది అరుణ్ కి.

"కృష్ణగారూ... నేనివ్వాళ వెళ్దామను కుంటున్నాను."

## రష్యాలో సొంత తోటలు

సోవియట్ యూనియన్‌లో ఫ్యాక్టరీ కార్మికులు, లేదా ఆఫీసు ఉద్యోగులు పండ్ల తోటలు, పూల మొక్కలు పెంచడానికి లేదా కూరగాయలు పెంచడానికీ, ఒక యిల్లు నిర్మించుకోవడానికి గ్రామంలో ఒక చిన్న స్థలం ఉచితంగా ప్రభుత్వం నుంచి వారికి లభిస్తుంది. పండ్ల తోటల నిమిత్తం యిచ్చే స్థలాన్ని ఒక సహకార సంస్థకు కేటాయించడం జరుగుతుంది. 1978 లో గ్రామీణ ప్రాంతంలో తోటలను పెంచే ఔత్సాహిక పట్టణవాసుల సంఖ్య 3,200,000 కు చేరింది.

గత సంవత్సరం ట్రేడ్ యూనియన్ సెలవు గృహాలలో, శానిటోరియమ్‌లలో, హోటళ్లలో దాదాపు 95 మిలియన్ల మంది తమ సెలవులను గడపగా, 15 మిలియన్ల మంది తమ స్వంత స్థలాలలో, తోటలలో సెలవులను గడిపారు.

అరుణ్ మాటలకు ఉలిక్కి పడ్డారు కృష్ణ-శిల్పా గూడా!

"ఎక్కడికి అరుణ్?" కృష్ణ అడిగాడు.

"ఎక్కడన్నా ఒక రూమ్ దొరుకుతుందేమో... ప్రయత్నం చేస్తాను."

శిల్ప చటుక్కున తలవంచుకుంది.

"ఏమిటి అరుణ్ నువ్వనేది?" కృష్ణ అడిగాడు కంగారుగా.

"అవును కృష్ణగారూ. ఇన్నాళ్లూ మీరిచ్చిన ఆతిథ్యానికి నా కృతజ్ఞతలు. నేనింక ఇక్కడ ఎట్లా వుండగలను? ఏ అర్హతతో వుండగలను? అట్లా వుండడం గూడా బావుండదు..."

"అరుణ్ ఆవేశపడకు. అన్నీ చక్కబడతాయి. నిన్ను నేను అర్థం చేసుకోగలను." అరుణ్ రాత్రి శిల్ప మాటలకి చాలా బాధపడుతున్నాడనీ, అప్‌సెట్ అయ్యాడనీ తెలిసింది కృష్ణకి. అతడి అహం దెబ్బ తిందని గూడా గ్రహించాడు.

అవును అతడట్లా బాధ పడడం సహజమే. ఎన్నోరోజులు రోజులు కాదు. నెలలనించీ ఎదురు చూస్తున్నాడు. శిల్పతో వివాహ జీవితం కోసం... పాపం ఇప్పుడిట్లా జరిగితే అది ఎదురు దెబ్బ కాదూ?

అరుణ్‌లో వచ్చినప్పటి ఉత్సాహం మచ్చుకైనా లేదు. కళ్లల్లో ఆ కాంతే లేదు.

"శిల్ప నువ్వే చెప్పాలమ్మా అరుణ్‌కి. అతడి బాధ నువ్వే తీర్చాలి." అన్నాడు కృష్ణ.

"వద్దండీ ఆమెని బలవంత పెట్టద్దు. బలవంతపు పెళ్లి ఇద్దరికీ మంచిది కాదు" అన్నాడు అరుణ్.

"ఏమ్మా ఏమంటావు?" కృష్ణ మళ్లీ అడిగాడు.

ముఖాన్ని రెండు చేతులతో కప్పుకుంటూ "బాబాయ్... ఇంక.. ఇంక... ఆ విషయం... దయచేసి ఎత్తకండి" అంటూనే వెక్కి తిరిగి లోపలికి వెళ్లి పోయింది శిల్ప.

'శిల్పలో ఇంత మొండి తనం వుందా' అని ఆశ్చర్యపోయాడు కృష్ణ.

అంతలో గేటు తీసిన చప్పుడయింది. లోపల్నించి శిల్ప వచ్చింది బయటికి అరుణ్ గూడా బయటికి వెళ్లాడు. వచ్చిన వాళ్లని చూస్తూనే నవ్వాడు అరుణ్ పలకరింపుగా!

"రండి ఆంటీ" శిల్ప గుర్తు పట్టింది.

"రండి రండి" ఇద్దరూ వాళ్లని లోపలికి ఆహ్వానించారు.

వచ్చిన వాళ్లతో ఇద్దరూ కృష్ణగదిలోకి వచ్చారు.

కృష్ణ జరిగినదానికి విచారిస్తూ, తల వంచుకుని జరగబోయే దాని గురించి ఆలోచిస్తున్నాడు. మనుషులు వచ్చిన సవ్వడికి తలెత్తిన కృష్ణకి క్షణం అర్థం కాలేదు. వచ్చిన వాళ్లని చూస్తూ వుండిపోయాడు.

"బాబూ కృష్ణా... వింతపని జరిగిందయ్యా..."

"వెంకట్రావుగారు... వాళ్ళమ్మాయి చిత్ర...మీకు తెలుసు కదూ?" పరిచయం చేశాడు అరుణ్.

చిత్ర పేరు వింటూనే కృష్ణ కళ్లల్లో వింత కాంతి మెరిసింది! తండ్రి వెనుక వున్న చిత్ర కేసి చూశాడు.

పమిట చెంగు నోట్లో పెట్టుకుని తల వంచుకుని వుంది చిత్ర. కన్నీళ్లు అవిరామంగా కారిపోతున్నాయి.

(ఇంకా వుంది)

# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

## నేషనల్ థియేటర్ వార్షికోత్సవం :

నేషనల్ థియేటర్ 28 వ వార్షికోత్సవాన్ని జులై 19వ తేదీన త్యాగరాయ గానసభ హాలులో రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పి.సి. రెడ్డి వైభవోపేతంగా ప్రారంభించారు. ప్రభుత్వం ప్రతి గ్రామంలోను ఆరుబయలు రంగస్థలం నిర్మించి, రంగస్థల కళలను ప్రోత్సహించాలని శ్రీ రెడ్డి సూచించారు. సంస్థ అధ్యక్షులు శ్రీ కె. రామచంద్రారెడ్డి రంగస్థల ప్రాముఖ్యం వివరించారు. భూమిశిస్తు కమీషనర్ శ్రీ ఎం.ఆర్. పాయి ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. కార్యదర్శి శ్రీ కె.కృష్ణమూర్తి వార్షిక నివేదిక సమర్పించారు. ప్రారంభంలో సంస్థ ఉపాధ్యక్షులు డాక్టర్ పి. నారాయణ రెడ్డి స్వాగతం పలికారు. మరొక ఉపాధ్యక్షుడు శ్రీ కె. కామేశ్వరరావు సందేశాలు చదివారు. సంయుక్త కార్యదర్శి శ్రీ పి.సత్యనారాయణ వందన సమర్పణ చేసిన తర్వాత, శ్రీ కె. శివప్రసాద్ ఈల పాట కార్యక్రమం జరిగింది. పిదప శ్రీ యర్రంసెట్టి శాయి రచించిన ప్రమోషన్ వచ్చింది, సంస్థ బాల విభాగం కన్వీనర్ శ్రీ సి. బద్రీనాథ్ రచించిన మంచి రోజులొచ్చాయి, శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రి రచించిన హద్దువిరారదు నాటికలు ప్రదర్శించారు. జులై 20 వ తేదీన ఇండియన్ నేషనల్ థియేటర్ యూత్‌సర్కిల్ ప్రథమ వార్షికోత్సవాన్ని హైదరాబాద్ జిల్లా కలెక్టర్ శ్రీ కె. చంద్రయ్య ప్రారంభించారు. రంగస్థల కళల్లో యువకులు శ్రద్ధ తీసుకోవలసిన అవసరాన్ని ఆయన నొక్కి చెప్పారు. కుమారి వీణా భరత నాట్యం, డాక్టర్ విజయమోహన్ బృందం 'నాటక్ నాటక్‌సే' అనే నాటకాన్ని, రవి మహాదేవన్ బృందం ప్రాచ్య పాశ్చాత్య సంగీతాన్ని శ్రీ కె. సి. ప్రసాద్ ధ్వన్యనుకరణను; శ్రీ వెంకటేశ్వర బృందం జుగల్‌బందీని, శ్రీ రాధాకృష్ణ బృందం మిమిక్రీషో [మూకాభినయం] ప్రదర్శించారు.

## శ్రీ గురునాథ్ పథకాలు :

ఆంధ్రప్రదేశ్‌కు వెయ్యి కిలో మీటర్ల సాగర తీరం ఉంది. అయినా మనం మనకు కావలసిన ఉప్పును పండించుకోలేక తమిళనాడునుంచి దిగుమతి చేసుకొంటున్నాము. తూర్పు చివరన ఉన్న నౌపడాలో కొంత ఉప్పు పండుతుంది. కాని పశ్చిమ బెంగాల్ తక్కిన రాష్ట్రాలకు నౌపడా ఎక్కడుందో కూడ తెలీదు. గుజరాత్ నుంచి ఉప్పు దిగుమతి చేసుకొంటారు. మన దేశానికి ఏటా 60 లక్షల టన్నుల ఉప్పు అవసరం. మన రాష్ట్రం ఈ అరవై లక్షల టన్నులలో ఐదు శాతం మాత్రమే ఉత్పత్తి చేస్తున్నది. అంటే మూడు లక్షల టన్నులు. గుజరాత్ 36 లక్షల టన్నులకు పైగాను, తమిళనాడు దరిదాపు 20 లక్షల టన్నులు ఉత్పత్తి చేస్తున్నది. మన రాష్ట్రంలో స్థాపించబోయే అల్యూమినా పరిశ్రమకు రోజుకు వెయ్యి టన్నుల ఉప్పు కావాలట. కనుక మన రాష్ట్రంలో ఉప్పును కనీసం లక్ష టన్నులకు పెంచడానికి అవకాశమున్నది. మనకు కోస్తాలో రైలు మార్గం వుంది. జలానికి తక్కువ లేదు. నౌపడా కేంద్రాన్ని బాగా అభివృద్ధి చేస్తే ఈశాన్య రాష్ట్రాల అవసరాన్ని మనం తీర్చవచ్చు. దీనితో మచిలీపట్నం వోడ రేవు కూడా బాగా ఉపయోగపడుతుంది. మన రాష్ట్రం ఇతర రాష్ట్రాలపై ఉప్పుకోసం ఆధారపడవలసిన అవసరం వుండదు. ఈ విషయాలను వివరిస్తూ ఉప్పు పరిశ్రమ నిపుణులు శ్రీ ఎం. ఎం. గురునాద్ రాష్ట్ర ప్రభుత్వానికి రెండు పథకాలు సూచించారు. ఒంగోలులో మూడు వేల యకరాలలో రెండు కోట్ల 40లక్షల వ్యయంతో రెండున్నర లక్షల టన్నుల ఉప్పు తయారు చేయవచ్చునని, నాలుగు కోట్ల వ్యయంతో మచిలీపట్నంలో నాలుగు లక్షల టన్నుల ఉప్పు తయారు చేయవచ్చునని ఈ రెండు పథకాలు ఆయన సూచించారు. ఉప్పు తగినంత లేకపోతే, రసాయన పరిశ్రమలే ఆగి పోతాయని ఆయన స్పష్టపరిచారు. శ్రీ ఎం. ఎం. గురునాద్ పథకాలను రాష్ట్ర ప్రభుత్వం ఆమోదిస్తే వెనుకబడి వున్న శ్రీకాకుళం, ప్రకాశంజిల్లాలు అభివృద్ధి చెందుతాయి.



డాక్టర్ శ్రీమన్నారాయణ.

కేంద్ర వ్యవసాయ మంత్రి శ్రీ సుర్జిత్ సింగ్ బర్నాలా నుంచి ( మార్చి 10 న ) హరిఓమ్ ఆశ్రమ్ ట్రస్ట్ అవార్డు (రు. 10,000లు, ప్రశంసాపత్రం)ని అందుకుంటున్న రాష్ట్ర పశు సంవర్ధక శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ డాక్టర్ ఓ. శ్రీమన్నారాయణ. రాష్ట్రంలో ( ఈ శాఖలో ) ప్రథమంగా ఈ అవార్డుని అందుకున్న డాక్టర్ శ్రీమన్నారాయణ అంతర్జాతీయ పశు వైద్య శాస్త్రజ్ఞుల సంస్థ సభ్యులు.

## నిద్ర లేపండి

— వెల్లూరి సీతారామేశ్వరరావు.

ఇక్కడిదాకా వచ్చాము.
ఇక్కట్లు పడుతూ
ఇరులగిరులెక్కుతూ
ఇక సాయం కావాలి.
ఇరుక్కుపోయిన రథాన్ని
నడిపించే సారథి కావాలి.
కల కరుగుతుంది
కలతలో.
కథ ముగుస్తుంది
కీకారణ్యపు మలుపులో.
అద్దెకుచ్చుకున్న తమస్సులో
అమెతలుండవు.
ఆపదలూ—అపస్వరాలూ తప్పే.
వాడు నేడైనా రేపయినా
ప్రయాణంలో వసలేదు
పాకుడురాళ్ల ప్రయాసతప్పదు!
మధ్య తరగతి మారీదు
మబ్బుల ఉందీ విత్యం
రోజు రోజూ గ్రహణం.
ఏడు గుర్రాలూ ఏకధారగ
ఏగావు పండిస్తాయి!
మార్పు ఎప్పుడు? ఎక్కడ? ఎలా?
ఎన్నెన్నో ప్రశ్నలు.
మందహాసాన్నిచ్చేది సమాజం
మధుమాసాన్నిచ్చేది గణతంత్రం.
అవి నిద్రపోతున్నాయి నిండుగా.
మీరయినా ముందుకురండి.
వాటిని నిద్రనుంచి లేపండి.

### వీరనారి బేగం హజరత్ :

ప్రథమ స్వాతంత్ర్య సమరంలో పోరాడిన వీర వనిత అయోధ్యారాణి బేగం హజరత్ మహల్ శత జయంత్యుత్సవాలను జూలై 20 న రాష్ట్రగవర్నర్ శ్రీ కె. సి. అబ్రహాం ప్రారంభిస్తూ, బేగంహజరత్ మహల్ వీరవనిత అని, ఆమె జీవిత చరిత్ర ప్రచురించాలని సూచించారు. ఆమె ఝాన్సీలక్ష్మీబాయివంటి గొప్పవీరవనిత అని శ్రీ విజయకుమార్‌సిన్హా అన్నారు.

### ఆర్. టి. సి. సమ్మె :

రోడ్డురవాణా సంస్థ నేషనల్ మజ్దూర్ యూనియన్ మినిస్టీరియల్ సిబ్బంది యూనియన్ పిలుపు మేరకు ఒక వర్గం జంటనగరాలలో జులై 23, 24 తేదీలలో సమ్మె జరుపడంతో నగరవాసులకు చాల ఇబ్బంది కలిగింది. సమ్మె సమయంలో ఆర్. టి. సి. అధికారులు ప్రత్యేకంగా బస్సులు ఏర్పాటు చేసినప్పటికీ ఆఫీసులకు వెళ్లే వారికి, స్కూళ్లకు వెళ్లే విద్యార్థులకు చాల ఇబ్బంది కలిగింది. పిల్లలు పుస్తకాలు మోసుకుని కాళ్లీడ్చుకొనివెళ్తూంటే దృశ్యం దయనీయంగా వుంది. కొన్ని చోట్ల బస్సుల పై సమ్మె దర్లు రాళ్లు రువ్వగా, బస్సుకిటికీల గాజు తలుపులు పగలడం, పలువురికి గాయాలు తగలడం, కొన్ని చోట్ల చక్రాలు గాలి తీసివేసినందున బస్సులు ఎక్కడివక్కడే ఆగి పోవడం జరిగాయి. ఆ బస్సులను చూస్తుంటే, యుద్ధ రంగంలో కూలిపోయిన ఏనుగులు జ్ఞాపకం వచ్చాయి. దాదాపు వంద బస్సులు ధ్వంసమయ్యాయని అధికార్లు చెబుతున్నారు. పెక్కు డిపోల ప్రాంగణాలలో సమ్మెదరులు సమావేశాలు జరిపి, తమ కోర్కెలను పునరుద్ఘాటించారు. రాష్ట్రమంతటా జరిగిన ఈ సమ్మెలో బస్సుల రాకపోకలు పూర్తిగా స్తంభించిపోయాయని యూనియన్ ప్రధాన కార్యదర్శి శ్రీ పి. రామమోహనరావు ప్రకటించగా, డెబ్బయి శాతం బస్సులు నడిచాయని ఆర్. టి. సి. అధికారులు తెలిపారు. ఒక వర్గం వారు ఈసమ్మెను రాజకీయ దురుద్దేశాలతో చేశారని ఆర్. టి. సి. ఉద్యోగుల సంఘం అధ్యక్షుడు డాక్టర్ రాజబహాదుర్ గౌడ్ విమర్శించారు.

### అనంత సత్యాలు :

అపూర్వ కవిత వ్యక్తిత్వాన్ని ప్రతిపాదించిన కావ్యం అనంత సత్యాలు. ఈ కావ్యం ఆవిష్కరణ జూలై 13వ తేదీన సాయంకాలం శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో శ్రీ దేవులపల్లి రామానుజారావు అధ్యక్షతన జరిగింది. ప్రముఖ రచయిత్రి శ్రీమతి లక్ష్మీ రమణ, శ్రీ రామానుజరావు, డాక్టర్లు ఎ. ఆర్. బాజి, సి. నారాయణరెడ్డి, హోంమంత్రి... ఎ. వి. సుబ్రహ్మణ్యం, శ్రీ పి. ఎస్. రామన్ (స్వరాజ్య పత్రికా సంపాదకులు) శ్రీ గణేశ్ కొత్తూరి (ఉత్తర అమెరికా తెలుగు సంఘం ప్రతినిధి), శ్రీ బాపురెడ్డి కవిత శక్తిని అనంతసత్యాల విశిష్టతను ప్రశంసించారు. శ్రీ బాపురెడ్డి ఇటీవల ఉత్తర అమెరికాలో పర్యటించి, డెట్రాయిట్ నగరంలో జరిగిన ఉత్తర అమెరికా తెలుగు సంఘం మహాసభలో పాల్గొన్నారు. అనంత సత్యాలు కావ్యాన్ని ఉత్తరఅమెరికా తెలుగు సోదరులకు అంకితమిచ్చారు. శ్రీ బాపురెడ్డి అమెరికా పర్యటన విశేషాలను వివరించి అనంతసత్యాలలోని కొన్ని ఖండికలు చదివి వినిపించారు. ఆవిష్కరణోత్సవం శ్రీమతి హైమవతీ భీమన్న ప్రార్థనతో ప్రారంభమయింది. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు స్వాగతం చెప్పారు.

### బందిపోటు దొంగల బెడద :

సంవత్సరం క్రితం జంటనగరాల జనం దొంగతనాలకు బెదిరిపోయి, వంతుల వారీగా గస్తీలు తిరగడం ప్రారంభించిన సంగతి అందరికీ తెలుసు. ఇప్పుడు జంటనగరాల శివార్లలో బందిపోట్ల భయం ఎక్కువయింది. రామంతాపురం ప్రాంతంలో వల్లి ఎక్కువ బస్తీలతో జూలై రెండవ వారంలో ఒక బందిపోట్ల ముఠా తిరుగుతూ దారినిపోయేవారినందరిని నిలువు దోపిడీ చేయడం, వారిని కాళ్లూ, చేతులూ కట్టి దారి పక్కని పొదలలో పారవేయడం, ఇండ్లలో దూరి దోచుకోడంవంటి దురాగతాలు జరిపారు. పోలీసులు పాపం! గాలిస్తూనే వున్నారు, వారికోసం. వాళ్లు పట్టుబడాలి కదా!

### ఉపశ్రుతి :

కేంద్రంలో దేశాయి ప్రభుత్వం పోవడంతో చాల హాయిగా వుందోయ్! అన్నాడు ఒకరు. ఎందుకు? అన్నాడు ఇంకొకడు. ఎందుకేమిటి కేంద్రంలో హరికుడు వచ్చాడు, ప్రధానిగా. మనమంతా ఆల్కహాలికులయి పోవచ్చు స్వేచ్ఛగా అన్నాడు మరొక మద్యప్రియుడు.



# అవీ ఇవీ అన్నీ

## మాతృభాషలో ప్రాథమిక విద్య

అంతర్జాతీయ బాలల సంవత్సరం ప్రచురణ: రచన: శ్రీ ఆబ్బూరు పురుషోత్తం 110 పేజీలు, వెల 4 రూపాయలు, ప్రతులకు 1] రచయిత పేర, గుణదల, విజయవాడ-5, 2] విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ2, 3] ప్రజాశక్తి బుక్ హవుస్, విజయవాడ-2 4] నవోదయ పబ్లిషర్స్, విజయవాడ—2.

## నవసృష్టి

గేయసంపుటి. రచన డాక్టర్ అంతటి నరసింహం, 108 పేజీలు, వెల 6 రూపాయలు, ప్రతులకు: నవతా సాహితి, 3—4—705/5, నారాయణగూడా, హైదరాబాద్.

## పువ్వులు

అరుణోదయ కళా నికేతన్, పెద్దపల్లి [కరీంనగర్ జిల్లా] వారి సమర్పణ స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, పెద్దపల్లి శాఖవారి ఆర్థిక విరాళంతో అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా, ప్రచురించిన గేయ సంకలనం. 30 పేజీలు, అమూల్యం, వివరాలకు శ్రీ ఆర్. బాలప్రసాద్, సంపాదకుడు 20 నెం. 2—4—4, శివాలయం వీధి, పెద్దపల్లి —505172.

## గుజ్జనగూళ్లు

[బాలసాహిత్యం] రచన కవిరావు, పేజీలు: 36, వెల: మూడున్నర రూపాయలు. ప్రతులకు: సువర్ణ పబ్లికేషన్స్, రేపల్లె-522265కి వ్రాయవచ్చును.






Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna

రూపలావణ్య రక్షణకు స్నిగ్ధముగ్ధత్వ పరి
రక్షణకు వయసును, సొగసును మురిపించి
మైమరిపించు సౌందర్య పోషణకు

# రూపాష్

సాండల్‌వుడ్ పౌడర్లను వాడండి

శిరోజాభివృద్ధికి, నల్లని నిగనిగలాడు కురు
లకు సాటిలేని పరిమళమునకు చల్లదనము
నకు ప్రశస్తమైన "రూపాష్" ఆమ్లా
బ్రిలియంటైన్











విజయ కెమికల్ అండ్
టాయిలెట్ వర్క్సు
తెలంగాణా
మద్రాసు-7